# ఆంధ్రభూమికొక అపూర్వాలంకారము

వేలు పిక్చర్సు వారి

# శశిరేఖాపరిణయం

లేక

# మాయాబజారు

త్వరలో రాబోవుచున్నది! వేచియుండుడు!!

గుండె లవియజేయు ఘోర అరణ్యములు. సింహ శార్దూలాది క్రూరమృగ సంచయములు. భయంకర యుద్ధములు.

మఱుపురాని మాయాజాలము. శ్రావ్యమగు సంగీతము. చక్కని ఫొటోగ్రఫీ. సాటిలేని రికార్డింగ్.



ద్వారకను గాంచి సంతసపడు సుభద్రాభిమన్యులు.
అభిమన్యుడు మాష్టర్ రాజేశ్వరరావు - సుభద్ర మిస్ శ్రీరంజని

వేయేల వృద్ధుడు మొదలు బాలునివఱకు వాంఛింపదగ్గ చిత్రమిదియే!

బుకింగ్ కొఱకు:

## వేలు పిక్చర్సు డిస్ట్రిబ్యూటింగ్ ఆఫీసు,

డన్మోర్ హౌస్, మైలాపూరు (పోస్టు), మదరాసు.

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము




బలహీనతవలన జనించు రుగ్మతలను ఆటంకపరచి, దేహమునకు సంపూర్ణ ఆరోగ్యమును, రక్తవృద్ధి, నరములకు పటుత్వము, కండపుష్టిని, భీమబలమును, తేజస్సును, జ్ఞాపకశక్తిని వృద్ధిపరచును.

జీ వా మృ త ము

ఆరోగ్యమును పునఃప్రతిష్ఠింపగల ప్రాణదాత.

---

# బాలభాస్కర




బిడ్డల లివర్ అండ్ స్ప్లీను వ్యాధులను పోగొట్టుటకును రాకుండచేయుటకును సిద్ధౌషధము.

కెమిస్టులవద్దను, స్టోరులలోను—దొరకును.

ఆ యు ర్వే దా శ్ర మ ము,

మ ద రా సు.

# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.

సంపాదకుడు :
ఆండ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుటము : ౪. ధాతు, కార్తికము : నవంబరు, 1936. సంచిక : ౮.

## సంపాదకీయసమాలోచన

### ౧. భారతదేశభాషావాఙ్మయములు : మహాత్ముని హితబోధ :—

పండ్రెండవ గుజరాతు సాహిత్యసమావేశమును పరిసమాప్తి గావించుచు గాంధిమహాత్ముడు భారతదేశభాషావాఙ్మయములను గూర్చి ఇట్లు వచించినాడు : 'ఏ మంచివిషయమునుగూర్చిగాని ఉపజ్ఞామహితమగు పుస్తకము ఒక్కటైనను భారతదేశమునందలి వివిధ భాషల వాఙ్మయములలో పామరజనులు తెలిసికొనతగిన శైలిలో లేదు. విద్యాబోధనము విదేశభాషలో జరుగుచున్న దురదృష్టదేశము ప్రపంచమున కంతటికిని ఒక్కటే హిందూదేశమే. పల్లెలయందు నివసించుచున్న పామరజనుల ప్రయోజనార్థము సులభసుందరవాఙ్మయమును సృష్టింపవలసిన బాధ్యత ఇట్టి సాహిత్యసమావేశములపై నిలచియున్నది. ఉపజ్ఞామహితము లగు రచనములు సాగించుటకు పల్లెలే అనుకూలప్రదేశములు. కావున సారస్వతార్చకులు పల్లెలకు మరలవలయును.' మహాత్ముని ఈ ఉపదేశము శిరోధార్యమైనది. మహాత్ముని ఈ పలుకులను మన ఆంధ్రవాఙ్మయమునకు హత్తించుకొనుట ఎంతేని అవసరము. మన సాహిత్యపరిషత్తువారు పాతపుస్తకముల ప్రచురణముతో మాత్రమే పరితృప్తులగుచున్నారు. మన విశ్వవిద్యాలయమువారు ఈ విషయములో చేయుచున్న కొద్దిపాటిపని పెద్ద విమర్శనకు గురిచేయతగినదిగా నున్నది. ప్రత్యేకవ్యక్తులు ఈవిషయమున చేయుచున్న కృషికి వలయు నంత పోషణప్రోత్సాహములు కలుగుటలేదు. ఎట్లుచూచినను స్థితి శోచనీయముగనే యున్నది. ఈ శోచనీయస్థితి తొలగువఱకును దేశకల్యాణమునకు విఘ్నేశ్వరపూజ జరిగినదని చెప్పుటకు వీలులేదు.

### ౨. ఆధునికాంధ్రకథకులు దీనిని గమనింతురా ?

అదే సమావేశమున గాంధిమహాత్ముడు గ్రంథకర్తలకు ఈవిన్నపమును చేసినాడు : 'స్త్రీలనుగూర్చి అతిశయోక్తులతో వర్ణనములు చేయకుందురుగాక ! కాగితముమీద మీరు కలముపెట్టి వ్రాయబూనినపుడెల్ల స్త్రీ మీకు మొదట తల్లియై యుండినదనియు, పిమ్మటనే స్త్రీ మీకు భార్యయైనదనియు అను సంగతిని జ్ఞప్తియం దుంచుకొందురుగాక !' ఆధుని కాంధ్రకథకులు ఈమహావాక్యరత్నమును గమనింపవలసిన అవసర మెంతేని గలదు. పత్రికాప్రచారము విస్తరిల్లి ఆంధ్రదేశమున వయోజనవిద్యావ్యాప్తి చే... మహత్తరముగ

జరుగుచున్నందుకు సంతోషింపవలసినదే కాని ఆ పత్రికలందలి కథలు మాతృస్వరూపిణులగు స్త్రీల పట్ల గావించుచున్న నైచ్యానుసంధానమును, తద్ద్వారమున పాఠకుల మనములందు కలుగుచున్న అశుచిప్రాపకములగు భావములును సంఘశ్రేయమునకైనవి గాకుండుట అంగీకరింపకతీరదు. చదువరులు రద్దికథలను కోరుచున్నారు కావున వ్రాయువారు రద్దికథలను వ్రాయుచున్నారను వాదములో అర్థములేదు. తప్పుదారిని బట్టిన ప్రజలరుచిని సవ్యమార్గమునకు త్రిప్పగలిగిన కవికలమే దేశమునకు కావలసినది. దేశశ్రేయమునకుకాని వాఙ్మయసృష్టి వాంఛనీయమైనది కాదని ఉచితజ్ఞులకు ప్రత్యేకము చెప్పనక్కఱలేదు.

౯. గుంటూరు మండలమున గాలివాన:—

కార్తికమాసపు కడవానలు ఏటేట ఆంధ్రదేశమున ఏదేని ఒక ప్రాంతమునకు నష్టము కలిగించుట పరిపాటియైనది. కాని ఈయేడు ఈవానలవలన గుంటూరుమండలమునకు కలిగిన నష్టము అపారమైనదిగానున్నది. తూలగా కురిసిన వర్షమునకు తుపానుగాలి తోడైనది. తాటిచెట్లు నిలువున చీల్చుకొనిపోయినవనుచో తుపానుగాలియొక్క తీవ్రత ఊహించుకొనవచ్చును. ముఖ్యముగ చీరాల, బాపట్ల ప్రాంతములందు గాలిదేవుడు వీరవిహారముసాగించి అచ్చట పచ్చముపాడు గావించినాడు. ఉప్పుటేర్లు, కాల్వలు పొంగినవి, రోడ్లు గండ్లుపడినవి; వంతెనలు కూలిపోయినవి; పంటలు చెడిపోయినవి; నిమ్మ, నారింజ, అరటి మున్నగు తోటలలో చెట్లు కూకటివేళ్ళతో పెళ్ళగిలి పడిపోయినవి, ఇండ్లకప్పు లెగిరిపోయినవి, రెండువందలకు మించిన మనుష్యులు చనిపోయిరి, పశునష్టమును అంచనావేయుటకే కష్టమైయున్నది. 1936 అక్టోబరు 28–వ తేదీని సంఘటించిన ఈ గాలివాన అరువదియేండ్లక్రితము 1864 నవంబరు 4–వ తేదీని సంఘటించిన బందరు ఉప్పెనవలె భయావహమై మఱువరానిదిగానున్నది. ప్రజానాయకులును, ప్రభుత్వోద్యోగులును ఆర్తులైయున్న ప్రజలకు వలయు సాయముచేయ ప్రయత్నములు సాగించుచున్నారు. ఈ ఆపత్సమయమున అచటి ప్రజలకు ఎల్లరును ఆర్థికసహాయముచేసి పుణ్యము కట్టుకొనవలసినదిగా కోరుచున్నాము.

౧౦. ఆర్థికమాంద్యము: హిందూదేశమున భీమావ్యాపారము:—

హిందూదేశమున భీమావ్యాపారపరిస్థితులను సూక్ష్మదృష్టితో పరిశీలించినవారికి ఒక విచిత్రవిషయము పొడగట్టును. 1929–వ సంవత్సరమునుండియు ప్రపంచమునందలి ఇతర దేశములతోబాటు హిందూదేశమునందును ఆర్థికమాంద్యము వీరవిహారము గావించుచున్నది. నాటినుండి ఏవ్యాపారము చూచినను మందగతిలోనే ఉన్నది. కాని భీమావ్యాపారము మాత్రము హుటాహుటినడలతో అభివృద్ధిమార్గమున పోవుచున్నది. ఆర్థికమాంద్యమువలన అందరి రాబడులును తగ్గినవి. రాబడి తగ్గియుండగా భీమాచేయుటకు ప్రజలు సంసిద్ధులగుట చిత్రముగనే యున్నది. దీనికి కారణము ఏమియో ఊహించుటకు ఎడములేకున్నది. డబ్బు విషయముప కలిగిన కాటకమువలన ప్రజలు ధనముయొక్క విలువను తెలిసికొని దానిని కూడబెట్టవలసిన అవసరమును గుర్తించి అట్లు కూడబెట్టుటకు సుకరమును, సురక్షితమును అయిన "పద్ధతియైన భీమాపద్ధతికి కడంగిరనవచ్చునా? కడంగిరనియే అనవలసి

యున్నది. ఆర్థికమాంద్యము ప్రబలిననాటినుండియు ఏవృత్తియందునుకంటె భీమాఏజెంట్ల వృత్తియందు ఎక్కువమంది ప్రవేశించినారు. 1929 నుండి 1934 వఱకుగల ఐదు సంవత్సరములలో పెక్కు భీమాకంపెనీల వ్యాపారము రెట్టింపు అయినది. ఆర్థికమాంద్యము భీమా వ్యాపారము నిట్లు పెంచుట మూలముగా దేశమునకు మంచి ఉపకారమునే చేసినదని చెప్పవలసి యున్నది

౫. శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారి జ్ఞాపకార్థము :—

వీరేశలింగముపంతులుగారు రాజమహేంద్రవరమునకు, మోతే గంగరాజుగారు ఏలూరునకును పురమందిరములను కట్టించి ఇచ్చినట్లే శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు నెల్లూరునకు పురమందిరము కట్టించియున్నారు. రెడ్డిగారి వదాన్యతకు అది శిఖరప్రతిష్ఠఅయి ఉన్నది. ఆసుపత్రులకు, ధర్మసంస్థలకు వారు పెక్కు దానములనుచేసి నెల్లూరు రెడ్లకీర్తికి మంచి ప్రచారమును కల్పించిరి. విశేషమేమన వారి వదాన్యత సారస్వతక్షేత్రమునుగూడ సారవంతమొనర్చినది. అట్టివారి జ్ఞాపకార్థము నెల్లూరు పౌరులు ఏటేట ఒక్కొక్క సారస్వతార్చకుని సత్కరింప తలపెట్టిరి. ఇట్టిపద్ధతి ఆంధ్రదేశమున వేరేయే పట్టణమునందును లేదు. నెల్లూరునివాసియగు తిక్కనసోమయాజి కేతనను సత్కరించిన నాటినుండియు నెల్లూరు పట్టణము సారస్వతార్చకుల సన్మానమునకు ఇతర పట్టణములకు మార్గమును చూపువదిగనే యున్నది. శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారి స్మరణార్థము ఏర్పఱుపబడిన సారస్వతార్చకుల ఈ వార్షికసన్మానము నెల్లూరునకువచ్చిన ఆమంచిపేరును ఇనుమడించునదిగా నున్నది. తెనుగు దేశమునందలి ఇతర పట్టణములును ఈపద్ధతి నవలంబించుట భాషాయోషకు నూతన పుష్టిని చేకూర్చుట యగును.

౬. మదరాసు కార్పొరేషను : ఆల్డరుమెన్ ఎన్నికలు :—

మదరాసు కార్పొరేషను ఎన్నికలందు కాంగ్రెసువారు అధికసంఖ్యాకులుగ విజయమందిరి. కార్పొరేషను సభ్యులందరునుకూడి ఎన్నుకొనవలసిన ఆల్డరుమెన్ను ఐదుగురును కాంగ్రెసువారే ఎన్నుకొనబడిరి. దీనివలన కాంగ్రెస్‌వారికి కార్పొరేషనునందుగల పలుకుబడి తెల్లమగుచున్నది. ఆల్డరుమెన్నుగా ఎన్నుకొనబడిన వారిలో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశము పంతులుగారును, తమిళనాయకుడు యస్. సత్యమూర్తిగారునుగలరు. వీరిలో ప్రకాశముపంతులుగారికి కాంగ్రెసుసభ్యులు మాత్రము ఓటుచేసిరి; సత్యమూర్తిగారికి కాంగ్రెసు సభ్యుల సంఖ్యకంటె ఆరుఓట్లు అధికముగ వచ్చినవి. దీనికి కారణము సత్యమూర్తిగారు కాంగ్రెసేతర సభ్యుల వోట్లనుకూడ ఏదోరీతిని ఆకర్షించుటయే యైయున్నదనవలయును. మరియు కార్పొరేషను సభ్యులలో పేరుకొనియున్న తమిళజాతీయాభిమానముకూడ దీనికి కారణమైయుండవచ్చును. ఆంధ్రుడు మదరాసుకోస్తాకు గవర్నరైనపుడు స్వాగతపత్రము ఇచ్చుటకైన అరవగాలితో నిండాఱియున్న మదరాసుకార్పొరేషను అంగీకరింపలేదు. కాంగ్రెస్‌వారు లోబఱచుకొన్న నేడు కూడ మదరాసుకార్పొరేషను అరవగాలితోనే నిండాఱియుండుట ఈ ఆల్డరమెన్ ఎన్నిక చెప్పక చెప్పుచున్నది.

## నెల్లూరు శ్రీరామా ఫిలిమ్సు వారి



మొదటి

తెలుగు

టాకీ చిత్రము

# సతీ

# తులసి

ఇది ఆంధ్రుల కళాభినిరతికి నిదర్శనంగా అధికవ్యయప్రయాసలతో తయారు చేయబడినది.

గానవాహినియై, కళానిలయమై, [illegible]ల బరణియై మిమ్ము ఆనంద పెట్టగలదు.

ప్రకృతము మద్రాసు, మైసూరు [illegible] లక్షోపలక్షలు చూచి సంతసించుచున్నారు. అచిరకాలములో ఆంధ్రదేశ మెల్లెడల ప్రదర్శింపబడనున్నది.

ముఖ్యపాత్రధారులు.

| | | |
|---|---|---|
| గగ్గయ్య | నాగరాజరావు | మాధవపెద్ది |
| పులిపాటి | కాళీచెంచు | రామతిలకం |
| రాధాకృష్ణయ్య | పరబ్రహ్మశాస్త్రి | శ్రీరంజని |

మైసూరు సంగీతవిద్వాన్

బి. యస్. రాజయ్యంగారి మధురగానము.

శ్రీమతి రాగిణీదేవి

భరతనాట్యములు కూడ ఈ చిత్రములో సంపుటీకరింపబడినవి.

| డైరెక్టరు : | కవి : | గానము : |
|---|---|---|
| చిత్రపు నరసింహారావు. | కవికోకిల దువ్వూరి రామిరెడ్డి. | బి. నరసింహారావు. |

*For Booking apply to :—*

**SREE RAMA FILMS, LIMITED,**

**NELLORE.**

# దీపావళి

౧

కాకులమూకయై దెస లెకాయకి క్రమింగిన కారుదయ్య మీ
చీకటిరెక్కలన్ చిదిమి చించి వికావికగా, వసుంధరా
శ్రీకి వెలుంగుభిక్ష దయసేయుచు దీపిక లన్నపేర నీ
వాకిటి కాపలా పనికి వచ్చెనె తారక, లాంధ్రసుందరీ !

౨

ద్వారముఖమ్మునన్ వెలుగుదండలు గ్రుచ్చి యమర్చినట్లు స్తోం
పారు పవిత్రదీపికలు పల్కుచునున్నవి 'దేశదాస్య మో
ఝూరతి సర్వ మర్పణముగా బలిపీఠము నెక్కినట్టి త
ద్వీర తపస్విని హృదయదీప్తులమే' మని ప్రజ్వలించుచున్ !

౩

అగ్గలమైన రేవ వెనుకాడనిచేవ సురారి గుండియల్
సిగ్గున గ్రుంగిపోవ ననిచేసిన సత్యకు ఈడుజోడు కా
దగ్గ పురంధ్రు లెందరికి తల్లివి నీవు ? వచింపు మోద్పు కే
లొగ్గి శరత్సుధాకర సముజ్వల రేఖకు దీపలక్ష్మికిన్.

౪

కాల మహాబ్ధిమున్గి యణగారిన బంధువులైనవారి గో
రీలకు ఈ వెలుంగు పొడలించుకపోకిన 'జన్న' తంచు దీ
పా లెగవేయ సాయిబుల బాలురు కాచిరి, వారి కక్షుర
శ్రీ లిడు కాంతి పుంజ మిడ లేదొకో నీకు స్వతంత్రతాప్రభల్ ?

౫

పావనమైన సంస్కృతికి పట్టిది ; వేడుక పాటి గాదు, పే
రావికి లోగి గుండె లవియంగ చెరంబడి మ్రగ్గిస్రగ్గి వా
పోవు పదారువేల పువుబోడు లలర్చిన నవ్వులిట్లు దీ
పావళియై జగమ్మునకు పండువ జేసిన వీదినమ్మునన్.

౬

గంజి గిన్నియలో కాటకమ్ము నిలువ
పొగులు జనులకు పండుగ పొత్తదేడ,
రక్త మాంసములోడ్చి నరాలు కొరుకు
బానిస తనమ్ము విడుట పబ్బములమొదలు.

# మహనీయమైన మానసరోవరానికి మార్గం

రచయిత :

శ్రీ గిర్రాజు రామారావు

### సామవేదగానము సాగినచోటు

మానససరోవరప్రాంతము ప్రశాంతమైనది. ప్రకృతికన్యకు లీలాప్రదేశ మిదియే. చూచిన కొలది మనోహరముగా నుండును. అందువల ననే దీనియొడ్డున రచింపబడిన సామవేదము సరససంగీత సాహిత్యములతో విరాజిల్లు చున్నది. పవిత్రబ్రహ్మపుత్రానది కిదియే మాతృ స్థలము. దేవతలు కాపురముండి నిత్యానుష్టాన ము లొనర్చుకొను పుణ్యసరోవరము మానస సరోవరము. ఇయ్యది హిమాలయపర్వత ములలోనున్నది.

హిమాలయపర్వతమాల 2,500 మైళ్లు పొడుగు 500 మైళ్లు వెడల్పు అని మనము చదివియేయుందుము. ఒకచోటమాత్ర మివి 200 మైళ్ళు వెడల్పుగలవు. అచ్చట కుమావు అను ఊరుగలదు. హిమాలయములలోనికి పోయినకొలది ఎత్తైన పర్వతములు, మహా రణ్యములు, మంచుకొండలు, ఈవిధముగా నల్లుకొని యగమ్యగోచరముగా నుండును. కుమావు దగ్గరనుండి సుమారు నూరుమైళ్ళు వరకు హిందువుల గ్రామములు కనుపించును. అచ్చట నివసించువారు భారతీయక్షత్రియులు. వీరివృత్తి వ్యాపారము. వీరు గుంపులుగా ఎచ్చట దిగిన యచ్చటే ఒకవూరు. వీరు కంబళ్ళు, ఉప్పు, చామరములు, సవరములకు బొచ్చు అమ్ముచుందురు.

కుమావునుండి యుత్తరమునకు పోయి నచో ఆల్మోడా అను పల్లెకలదు. ఇచ్చట ఓక్, పైన్ అరణ్యములు చూచుటకు చాల ఆనందముగా నుండును. ఎచ్చట చూచినను ఫలవృక్షములు. ఈయూరు పర్వతశిఖరము ననే యున్నది. ఆల్మోడానుండి నాలుగు దినములు ఉత్తరమునకు ప్రయాణముచేసినచో అస్కోట అను ఊరు తగులును. ఇచ్చట విక్రమబహదూర్ సింహపాలుడు కైలాస యాత్రీకులకు గట్టించిన ధర్మసత్రము కలదు. అస్కోటకు నాలుగుమైళ్ళలో గోరీకాళీనదుల సంగమస్థానము.

### ప్రళయధ్వనితో ప్రవహించు నదులు

కాళీనది చూచుటకు చాల భయంకర ముగా నుండును. ఇది ప్రవహించునపుడు ప్రళయధ్వని చేయుచుండును. దానిచుట్టు ప్రక్కల లోయలు, గుహలు, వెలుతురు చొరని మహారణ్యము, చూపానని పర్వతశిఖ రములు, నిర్జనప్రదేశము— కాళీనది భయంకరప్రవాహము నిశ్చయముగ ప్రయా ణీకుల ప్రాణములను కంపింపజేయును. కాళీ నది వెంబడి పర్వతముల కెగప్రాకుచు, దుము కుచు ఖోలాగ్రామమువరకు పోయిన పిమ్మట దాళీనది కనుపించును. ఇది మరింత భీకరమై

నది. ఇది సింహగర్జనముచేయుచు పడుచు లేచుచు సుళ్లు తిరుగుచు పెద్దబండలను సైతము దొర్లించుకొని వచ్చుచుండును. ఈచిత్రమును ఒక గంటయైనను చూడనిదే యాత్రీకులు ముందంజవేయరు. ఆనదీవేగము వర్ణనాతీతము. ఖేలాకు తరువాత నున్న గ్రామము శోశ. ఇచ్చట సరళిదేవదారు మొదలగు వృక్షములు విరివిగానున్నవి. మార్గమునకు రెండు ప్రక్కలను రకరకములగు ఫలవృక్షములు, వింత వింత పూలచెట్లు, ఓషధులు, భూలికలుగా నుపయోగింపదగిన మొక్కలు అల్లుకొనిపోయినవి. ఇట్లు బయలుదేరిన నెలరోజులలో గల్లా అను గ్రామము చేరుదుము.

ఎనిమిది మైళ్ళవరకు నీటిచుక్క దొరకదు

గల్లానుండి మాల్పాగ్రామమునకు పోవు త్రోవలో నొక పెద్ద పర్వతముగలదు. ఇది నిజముగా ప్రాకవలసిన పర్వతము. కొన్ని తావులందు కేవలము దుముకవలసినదేగాని వేరుమార్గములేదు. పైనజూచిన నొక స్తంభము ప్రాకవలసినది కనుపించును. క్రిందజూచిన స్తంభముచివర నిలచినట్లనుపించును. భూమి యనునది యోజించుటయే సాధ్యముకాదు. ఒక పెద్దరాయి పడవైచినచో అది యెచ్చట పడునో అంతుతగులదు. దీనిలో మరియొక విశేషముకలదు. ఎండతీవ్రతకు రాళ్లు క్రాగుచుండును. కాని మరియొక పర్వతశిఖరపు నీడవలన కొంచెము చల్లదనమనుపించును. ఎనిమిదిమైళ్ళవరకు నీటిచుక్క దొరుకదు. ఈ మార్గమును బాగుచేయుటకుగాను మైసూరు మహారాజావారు 20 వేల రూపాయిలును, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము వారు 30 వేలును దానముచేసిరి. విశ్రాంతితీసికొనుటకు రోడ్డు గుమాస్తాల గుడిసెలు మాత్రము అరుదుగా గనుపించును. ఈ గండమును దప్పించుకొనిన మరియొక పెద్దగండము కలదు. అది బూందీయను గ్రామసమీపము. మార్గము చాల భయంకరముగా నుండును. జలప్రతాపము విస్తారము. చూచుచుండగనే కొండలలోనుండి ప్రవాహములు వచ్చిపడును. చూచుటకు ఆనందముగాను భయముగాను ఉండును.

కాళిదాసు యక్షకన్యలిచ్చటివారు

బూందీనుండి రెండుమైళ్లువరకు చక్కని యుద్యానవనములు కనుపించును. కాళిదాసు ఈ ప్రదేశముల జూచిన పిమ్మటనే అలకాపురి యక్షకన్యలను వర్ణించెనని ప్రతీతి. బూందీకి కొలదిదూరములో గార్బ్యాంగకలదు. ఇది సముద్రముకన్న 12,000 అడుగు లెత్తు. ఇచ్చట చలియెక్కువ. అందువలన యాత్రీకులు దుప్పటులు కప్పుకొందురు. ఇచ్చట బ్రిటిష్‌వారి పోస్టుఆఫీసుకలదు. మెరకపంటలు, బంగాళాదుంపలు పండింతురు. ఆల్మోడు నుండి ఇచ్చటకు 140 మైళ్లు.

మేఘసందేశములోని యక్షునిస్థలము

గర్బ్యాంగలో జలవాయువులు స్వచ్ఛములు. సృష్టిచిత్రములు సుందరము. ప్రకృతి సౌందర్యము మహానందముగా నుండును. ఇచ్చట కాళీనది చిన్నదిగానుండును. ఇచ్చట నుండి ఉత్తరమునకు జూచినచో హిమవత్పర్వతశిఖరములు కనుపించును. మేఘదూతలోని యక్షుడిచ్చోటనుండియే శిఖరములను జూచి వర్ణించెనని చెప్పక తప్పదు. గర్బ్యాంగలోనున్నంతసేపు స్వప్నమువలె నుండును. అచ్చటి ప్రతివస్తువును చూచునపుడు ప్రపంచమును మరచిపోవుట నిజము. అవి యన్నియు

నేమో కథలలో వర్ణించినట్లుగా తోచును.

శేయింబవళ్లు ఎడతెగని మంచువర్షం

గర్వ్యాంగ విడచి కొంతదూర మరిగిన చిన్న చిన్న గుట్టలు కనుపించును. ఇవిమట్టివి కాని రాళ్ళవికావు. భూగర్భవైజ్ఞానికు లిచ్చట నగ్నిపర్వతము లెప్పుడో పుట్టెనని పల్కుచున్నారు. అగ్నిపర్వతములవలననే మట్టిగుట్ట లేర్పడును. భూగర్భవిద్య, ఖనిజవిద్య, జంగమవిద్య, వనస్పతివిద్య మొదలగు ప్రకృతి విద్యల కీ ప్రదేశము పాఠశాల. ఇచ్చటకు దగ్గరలోనున్న లీపూపర్వతమునుండియే కాళీ నది పుట్టుక చూడవచ్చును. ఈ ప్రదేశము టిబెట్టు రాజ్యములోనిది కాని భగవంతునిదని చెప్పుట సమంజసము. లీపూపర్వతము దగ్గర డంగ్ డంగ్ అను పల్లెకలదు. అచ్చట శేయింబవళ్లు మంచు కురియుచునేయుండును. అందువలన చలియధికము. రాత్రులందు మంచుకొండలు విరిగి పడుచుండును.

2 మైళ్ళు నడచిన పిమ్మట సూర్యదర్శనము

లీపూ పర్వతము సముద్రముకన్న 17,600 అడుగులు ఎత్తు. ఇది యెక్కుట చాల కష్టము. శరీరము నిమిషములో శీతలమైపోవును. అందులకై వేడిగానుండుటకు కంబళ్లుకప్పుకొని వేడిచేయు పదార్థములను తినుచుండవలెను. కొన్ని ప్రదేశములలో మంచుగడ్డ మీదనే నడువవలెను. దిక్కులు చూడలేము. చూచినచో మంచు గోడలు తప్ప నేమియు కనుపించదు. ఇచ్చట గాలి విపరీతముగా వీచుచుండును. పరధ్యానముగా నున్నచో ఆ గాలి ప్రమాణికులను ఎగరగొట్టుననుభయముపుట్టును. ఈ విధముగా రెండుమైళ్లు నడచినపిమ్మట సూర్యదర్శనము కలుగును. చెట్లు కొండలు మనుష్యులు హిమమయము. అచ్చటచ్చట టిబెత్తువారి జండాలు కనుపించును. ఇంకను రెండు మైళ్లు ముందునకు నడచిన పిమ్మట తాకలాకోట అను పర్వతము కనుపించును. దానిపై చెట్లుచేమలుండవు. ఇది కోటవలెనేయుండును. సూర్యకాంతికి మెరయుచున్న మంచుకొండలు రంగురంగులతో విరాజిల్లుచుండును. అచ్చట వ్యవసాయముకూడ సాగుచుండును. వ్యవసాయదారుల యిండ్లు చాల సుందరముగా నుండును. చూచుట కొక క్రొత్తప్రపంచమువలె కనుపించును. యాక్, చమర మృగములు కంటికి గనుబడుచు తిరుగుచునే యుండును. వృక్షము కనుపించదు కాని గరిక విస్తారముగా నుండును. ఈ గరిక చాల బలముకలది కనుకనే యచ్చటి గొడ్లు గోదలు చాల బలిష్ఠముగా నుండును. కరనాళీనది పుట్టిన దీచోటనే. అది నేపాళముగుండా ప్రవహించుచున్నది. ఈ కోటకు పదిమైళ్ళదూరములో ఖోచరనాథుని మఠముగలదు. దానియందు సీతారామలక్ష్మణులవిగ్రహము లున్నవి. విగ్రహములముఖములు బంగారముతోను చేతులు వెండితోను చేయబడినవి. సింహాసనమున గరుడుడును, ఆంజనేయులును, శేషుడును చెక్కబడిరి. మరియొక గదిలో సప్తఋషుల విగ్రహములుకలవు. శ్రీరామలక్ష్మణుల మందిరములో నఖండదీపము వెలుగుచుండును. మరియొక చోట శాక్యముని ప్రతిమగలదు. హస్తలిఖిత పుస్తకాలయ మొకప్రక్కనున్నది. ఇది చూచుట కాశ్చర్యముగా నుండును. పుస్తకములు గుడ్డలలో చుట్టబడి బహుజాగ్రతగా నుంపబడినవి. సింహద్వారముకడ స్త్రీపురుషులు ప్రణవమంత్రము నుచ్చరించుచుందురు. వైష్ణవమతప్రచారకు లెవ్వరో దీనిని నిర్మించిరని కొందరివాదము. ఈ మఠమునకు సమీప

మునసే లామాగురువు పీఠముగలదు.

### శివలోకము నుతాకు మానసరోవరము

ఖోచరనాడ్ టిబెట్టునకు పడమటగాను న్నది. దీనికి మానససరోవరము 16 మైళ్ళ దూరము. అంతవరకును చెట్లులేని పర్వతమాల గలదు. శిఖరములు మంచుతో మూయబడుటచే చూపానదు. మానససరోవరము వరకును కొండలెక్కి దిగుచుండవలెను. గౌరి ఉడియాయను గుహదగ్గర విశ్రాంతి తీసికొన వచ్చును. ఈ ప్రదేశము సముద్రముకన్న 18,000 అడుగులు ఎత్తు. సూర్యకిరణములు కొంచెముగా తగులుచుండును. ఆకాశము నిర్మలమై స్వచ్ఛముగా కనుపించును. వాయుమండలము గంభీరముగాను ప్రశాంతముగాను ఉండును. కుడిప్రక్క హిమాలయములు, ఎడమప్రక్క చెట్లులేని పర్వతములు వరుసగా నుండును. అదియొక భవ్యదృశ్యము. అది దివ్యదేశము. అడుగడుగునకు భగవంతుని సృష్టిచాతుర్యమును లోలోన నానందించుటయేగాని వర్ణించలేము. మానససరోవరము చేరువగుచున్నకొలది హృదయము విశాలమైపోవుచుండును. ఈ మానవప్రపంచమును మరచిపోయి కేవలము కైలాసములో దేవతలతో దిరుగుచున్నట్లనుపించును. ఒక ప్రదేశమునుండి రెండు పర్వతపాదముల దాకుచు విస్తారజలరాశి కనుపించును. నీలవర్ణముతో ప్రశాంతముగా హృదయాకర్షణముగా విరాజిల్లునదియే మానసరోవరము. ఇది పోను పోను పెద్దదై విశాలమై సుమారు 40 మైళ్ల వరకు కనుపించును. దాని చుట్టుప్రక్కల మైదానము. కైలాససౌందర్య మింతకంటె గొప్పదికాదు. మానససరోవరము శివలోకమును దాకుచున్నదని పురాణములు చెప్పును. దానియొడ్డున శివుని విగ్రహమేకాక సమస్త దేవతల ప్రతిమలుకలవు. హిమాలయములను గూర్చికాని, మానసరోవరమును గూర్చిగాని మన గ్రంథములలో వర్ణించినవి పరిపూర్ణముగా కనుపించవు. వర్ణించుటకు మాటలు చాలవు. వారికు లూహింపవలసిన దృశ్యము. దీనికి పశ్చిమముగా నున్నది మాంధాత పర్వతము. మరికొంచెము దూరమువ సముద్రముకన్న 22,000 అడుగుల ఎత్తున కైలాసగిరి కనుపించును. శిఖరము మంచుమయమగుటచే నొక్కటే తెలుపు. మానససరోవరము దగ్గర రకరకములగు పక్షులు, బాతులు, తెల్ల హంసలు, చిలుకలు మొదలైన వనేకములు కనుపించును.

### మోక్షము నిచ్చే గౌరీకుండస్నానము

మానసరోవరమునకు పడమట 15 మైళ్ళదూరములోనే కైలాసపర్వతమున్నది. దీని చుట్టుకొలత 25 మైళ్ళు. ఈ పర్వతమునుండియే సింధునదిపుట్టుక. ఈ పర్వతమునకు 18,000 అడుగుల ఎత్తులో గౌరీకుండము కలదు. దీనిలో స్నానముచేసినచో మానవుని కడసారి కోరిక నెరవేరినట్లే. అనగా మోక్షము చేకూరినట్లే. ఇంకను ఎక్కవలసినది 4000 అడుగులు. అనేకులు ప్రయత్నించుచున్నారు. యాత్రికులు చాలమంది క్రింది నుండియే నమస్కరించి పోదురు. కైలాస పర్వతముదాటి యింకను పడమటికి ఒకదినము ప్రయాణముచేసినచో సట్‌లెజ్ నది పుట్టుక కనుపించును. అచ్చటనుండి దక్షిణముగా ప్రయాణముచేసినచో కొద్ది దినములలో భస్మాసురుని స్వగ్రామము తీర్థపురిక్షేత్రము గలదు. ఇచ్చట ననేక ధర్మశాలలు కలవు. కావున మనమిచట విశ్రాంతి తీసికొందము.

# అత్తకి అల్లుడి ఆశ, కాని…

రచయిత:

ఆర్. శ్రీరామమూర్తి, బి. ఏ.

ప్రతి ఆంధ్రప్రాణీ మాట్లాడడం నేర్చుకుంటూ వుచ్చరించే మొదటి పదం 'అత్త'. అత్త తరవాత గాని 'తాత' పదం రాదు. నాలిక ఆడించి నేర్చుకునే పదాల్లో మొదటిదిఅయిన 'అత్త' వల్ల సూచింపబడే చుట్టరికం దానిని ఉచ్చరించేవారిజాతినిబట్టి రెండువిధాలు గా వుంటుంది. మగవానికి పెళ్లాంతల్లి అత్త, ఆడదానికి మగనితల్లి అత్త.

ఇద్దరూ అత్తలే. కాని ఆడదాని అత్త ఏదేశంలోను మంచిపేరు సంపాదించలేదు. అత్తలమంచీ వేములతీపూ లేదనే తెనుగుసామెత ఈ చుట్టరికం సందర్భంలోదే. ఈసందర్భంలోదే అయిన అత్తలేని కోడలు ఉత్తమురాలు, కోడలులేని అత్త గుణవంతురాలు అనే సామెతకూడా ఆడదాని అత్తయొక్క అయోగ్యతను గాఢంగా ప్రదర్శిస్తోంది. కాబట్టే అత్తలేనిచోట ఆడపిల్లను ఇవ్వడానికి సాధారణంగా తెనుగు గృహస్థులు ఉత్సాహపడతారు.

## అత్త అల్లుడికి ఆత్మబంధువురాలు

ఇక మిగిలిన రెండోరకపుఅత్త అనగా మగవాని అత్త ప్రతిదేశంలోను మంచిపేరే సంపాదించింది. ఈజాతి అత్త అల్లుడికి ఆత్మబంధువురాలు అవుతుంది. ఆలివంకవారు ఆత్మబంధువులు అనే సామెత ఉండనే వుంది. ఆలివంక ఆత్మబంధువుల్లో అగ్రస్థానం అత్తదే. అత్తలమీద అల్లుళ్లకి ఉండేమోజు హద్దులేనిది. కాబట్టే శ్రీకృష్ణుడు తానుపెళ్లాడిన ఇళాదేవియొక్క తల్లిఅయిన రాధమీద మోజుచూపేడు. శివుడు తాను పెళ్లాడిన పార్వతియొక్క తల్లిగారి యిల్లు అయిన కైలాసంమీద కాపురంపెట్టాడు. మహావిష్ణువు తాను వివాహంచేసుకున్న లక్ష్మియొక్క పుట్టిల్లు అయిన పాలసముద్రంలో బిచానావేశాడు. దేవతల్లోనే అల్లుళ్లతీరు యిల్లావుంటేటప్పుడు సామాన్యసంసారాల్లో అల్లుళ్లతీరు ఎల్లావుంటుందో చెప్పనే అక్కర్లేదు. అత్తలులేనిచోట అల్లుళ్లకు ముద్దుమురిపాలూ, అచ్చటముచ్చటలూ జరగవని తెనుగు గృహస్థులు భయపడతారు.

## అత్తకి అల్లుడి ఆశ, బ్రాహ్మడికి పప్పు ఆశ

సరే! అల్లుళ్లకి ఈజాతి అత్తలు ఇంతహితంగా వుంటారు. ఈ అత్తలకు అల్లుళ్లుఅన్నాకూడా అంత హితవుగా వుంటుందా అనేప్రశ్న కలగవచ్చు. అన్యోన్యంవుంటేగాని ప్రేమ, అభిమానం ఎల్లాఏర్పడతాయి? సాధారణంగా స్త్రీలు కొడుకులమీదకంటె అల్లుల్లమీదే ఎక్కువ అభిమానంగావుంటారు. అల్లావుండకపోతే అల్లుడికివండినఅన్నం కొడుక్కిపెట్టి కొట్టుకొందిట అనే సామెత ఎల్లాపుడుతుంది? అత్తలకు అల్లుళ్లమీద వుండే అభిమానాన్ని ఇంతకంటె కూడా గాఢంగా సూచించే సామెత మరోటి వుంది. 'అత్తకి అల్లుడి ఆశ, బ్రాహ్మడికి పప్పు ఆశ' అని.

## అత్తని అల్లుడిని వెలిబెట్టేజాడ్యం

కాని లోకం ఓర్చలేంది. అత్తకి అల్లుడంటే వుండే ఆశని చూసి లోకం కళ్ళల్లో కారం చల్లుకుంది. నియమాలంటూ పెట్టి వాళ్ళ ఇద్దరికీ ఎడబంధాలు తెచ్చిపెట్టింది. ఆంధ్రదేశంలో పెళ్ళి అయిన కొత్తలో అత్తా అల్లుడూ ఆషాఢమాసంలో ఒకగడప దాటకూడదు. అంటే ఒకచోట వుండ

కూడదనే కొాదండి అర్థం. తెలగాలు, వెలమలు మొదలైన సంఘాల్లో అత్త అల్లుడికంట పడకూడదు. చెప్పవస్తే ఇల్లాంటివి శరపరంపరగా చెప్పవచ్చు. అత్తనీ అల్లుడినీ వెలిబెట్టే ఈజాడ్యం ఒక్క తెనుగు దేశంలో నేలేదు. సర్వే సర్వత్రా ప్రపంచం అన్ని దేశాల్లోను, అన్ని జాతుల్లోను వుంది. కొంచెం కొంచెంగా మనవిచేస్తా.

### అత్తను, ఆమెఅప్పచెల్లెల్నికూడా చూడ్రాదు

బాండీజాతి మనుష్యులలో మనువుకుదిరినప్పటి నుండీకూడా అత్త అల్లుణ్ణి చూడకూడదు. మాటలు కుదిరినతరువాత పెళ్ళిపూర్తి అయ్యేలోపుగ మగవాడు తనపెళ్లాంతల్లిని చూడకుండావుండడం న్యూసౌత్ వేల్సులోని జాతులలో ఆచారంగా వుంది. పెళ్ళి అయినతర్వాత చూసుకున్నా అంత ఇబ్బంది లోదికాదు. విక్టోరియన్ తెగ మనుష్యులలో మనువుమాటలు ఖాయమైన ఘడియమొదలు ప్రాణాలు పోయేవరకు అల్లుడు తన భార్యతల్లినికాని, పెదతల్లులను, పినతల్లులనుకాని కన్నెత్తి చూడకూడదు, వాళ్ళతో పన్నెత్తి పలుకకూడదు. మాట్లాడక తప్పనిచో అన్యాపదేశంగా గోడనో గొందినో ఉద్దేశించి మాట్లాడినట్లుగా మాట్లాడాలి. ఇతరులతో మాటలాడేటప్పుడు కూడ అత్తపేరు అతను ఉచ్చరించకూడదు.

### అత్త అల్లుడికంట బడరాదు

జూలూ జాతిలో ఈనియమాలు మరీ కఠినంగా వుంటాయి. వారిలో అత్తా అల్లుడూ ఒక గుడిసెలో వుండకూడదు, ఆమెపేరు అతను ఉచ్చరించకూడదు. ఆమెతో కలిసి ఏకపంక్తిని భోజనంచెయ్యడంకాని, ఆమెను కన్నెత్తి చూడ్డంకాని, ఆమెతో మాటలాడ్డంకాని చేయకూడదు. దారిలో ఎక్కడేనా అత్తా అల్లుడూ తారసిల్లినా ఒకర్ని ఒకరు పలకరించుకోకూడదు-అప్పుడు ఆమె తనతలని రొమ్ముల్ని కప్పుకోవాలి. అతనిభార్యపాలుతాగినరొమ్ముల్ని అతను చూడకూడదు. తిరిగి పోవడానికి వీలులేని రోడ్లమీద వారు తారసిల్లి తల రొమ్ములు అచ్ఛాదించుకోవడానికి ఆమెకు అవకాశంలేకపోతే ఆమె తలచుట్టూ ఒక గడ్డిపరక కట్టుకుంటుంది. అతనిభార్య పాలుత్రాగినరొమ్ముల్ని అల్లుడు చూడకూడదుకొాబట్టి సాధారణంగా ఈజాతిస్త్రీ అతని చూపులకు అందకుండా వుంటుంది. తడకరాయభారంగా మధ్యను మనిషిద్వారా గాని వాళ్లు మాట్లాడుకోకూడదు. శారియా, బారియా జాతులలోకూడా అత్త అల్లుడికంట బడకుండా దాక్కుంటుంది.

ఆస్ట్రేలియాఖండములోని ఆదిమనివాసులలో కూడా ఈ ఆచారం విశేషప్రచారంలోవుంది. పెళ్ళిమాటలు స్థిరపడినప్పటినుంచీ అత్తా అల్లుడు ఒకర్ని ఒకరు చూసుకోరు. ఈజాతిలో బట్టలు కట్టుకోవడానికి అలవాటుపడివున్నవారిలోని స్త్రీలు అల్లుడికి నూరుగజాలదూరంలో సంచరించ వలసివచ్చినా పూర్తిగా బురఖావేసుకోవలసిందే. ప్రాణాంతకమైన అవసరంవస్తే తప్ప ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. బనియాబనియాదేశంలోను, మేరీరివర్ రాష్ట్రంలోను నివసించే జాతులలో అత్తా అల్లుడూ ఒకర్ని ఒకరు చూసుకుంటే శిక్షాస్మృతిక్రిందకు వచ్చేటంతటి ఘోరనేరమౌతుంది.

### అత్తదృష్టిసోకితే అల్లుడికి పిచ్చి

ఫ్రేజరు ద్వీపంలో అత్తదృష్టి ఏసమయంలోకాని అల్లుడిమీద పడకూడదు. ఖర్మంచాలక ఆమెదృష్టి అతనిమీదపడిందా అతనికి పిచ్చిఎక్కిపోతుందనీ అతను పోయి డొంకల్లోను డొర్రెల్లోను అడివిమనిషిలా జీవిస్తాడనీ ఆద్వీపవాసుల గాఢమైన నమ్మకం.

ఆస్ట్రేలియాలోని కుర్నాయి తెగలో కూడా అత్తా అల్లుడూ ఒకరితో ఒకరు మాట్లాడుకోకూడదనీ, ఎట్టి వ్యవహారాలు జరుపుకోకూడదనీ ఆచారం చిరకాలంగా పాదుకునివున్నది. ఈ ఆచారానికి భిన్నంగా నడవడానికి వారు ఎంతమాత్రమూ ఒప్పుకోరు.

### అత్త అల్లుడికి అన్నంపెట్టకూడదు

ఉత్తరఅమెరికాలోని ఇండియన్సులో కూడా

ఈ ఆచారం సర్వసాధారణం అయివుంది. ఓమాహా తెగలో మగవాడు తనభార్యతల్లి తో మాటలాడడు. ఆమెకూడా అతనితో ముఖాముఖి మాటలాడకూడదు. అల్లుడికి ఆమె అన్నంపెట్టవలసివస్తే ఆమె తన కూతురిచే అతనికి అందచేస్తుంది. ఆసమయానికి ఒకవేళ కూతురుకనక యింట్లో లేకపోతే కంచంలో అన్నం, కావలసిన పదార్థాలు పెట్టేసి ఆమె యింట్లోంచి బయటికి వెళ్ళిపోతుంది. తరువాత అల్లుడు ఆ అన్నాన్ని ఆరగిస్తాడు. పదియేళ్ళ ఎడబాటు తరువాత అల్లుడువచ్చినా అన్నంపెట్టే ఆచారం ఇదే అయివుంటుంది కాని ఏమీ మార్పుకాని సడలుపాటు కాని వుండదు. యారవాక్ తెగలో అల్లుడు అత్త మొగం చూడకూడదు. ఒకవేళ వాళ్లు ఒకేయింటిలో వుండవలసివస్తే ఎడమొగంగాను పెడమొగంగాను వుంటూ వదుమను తెరవుంచుకోవాలి.

అత్తవైపు కాళ్లు పారజాపకూడదు

బన్యాయి తెగలో అల్లుడు అత్తని చూడవచ్చును. కాని ఆమె సమక్షంలో కనక అతనుకూర్చుంటే మోకాళ్ళమీద మోకరించుకు కూచోవాలి. ఆమెవైపు కాళ్లు పారజాపకూడదు. కాంగాలో ఒక సామెత ఉంది. ఏమంటే: 'మా అత్తకు నామీదకోపం వచ్చింది. కాని నాకేంనష్టం. మేం ఇద్దరమూ ఒక కంచంలో తింటామా ఏమన్నానా?'. బాన్‌డాయి జాతిలో కాబోయే అల్లుడుకూడా అత్తతో భోజనం చేయకూడదు. పెళ్ళిఅయినా ఏ సందర్భంలోకాని అతడు ఆమెతోకలసి భోజనంచెయ్యకూడదు. ఆంబోనియాలోను, బూరూలోనూకూడా ఇదేపద్ధతి. హోల్మ్‌హే[illegible]లో అల్లుడు అత్తవారింట్లో వుండవలసివచ్చినపుడు తనభోజనానికి తనభార్య తల్లిదండ్రులు ఉపయోగించే కంచాలేనా ఉపయోగించకూడదు.

అత్త, అల్లుడు పేర్లు చెప్పుకోకూడదు

సెంట్రల్ శెలిబీస్‌లో అల్లుడు అత్తతో రహస్యంగా మాట్లాడకూడదు. సీరమ్‌లో అతను ఆమెదగ్గరకుకూడా రారాదు. ఆమె అతని పేరుకాని, అతను ఆమెపేరుకాని ఉచ్చరింపకూడదు. ఇల్లా ఒండొరుల పేర్లు ఉచ్చరింపరాదనేఆచారం టొర్రెస్‌స్ట్రెయిట్సులోను, సియూక్సులోను, ఓమహాస్‌లోను, కాఫిర్సులోను, బూరూలోను, ఆరులోను, క్యాద్వీపాల్లోను వేటార్‌లోను కూడాఉంది. బాంక్సుద్వీపాల్లో అల్లుడు అత్తచెంతకు పోవడంకాని, ఆమెపేరు పలకడంకాని చెయ్యరాదు. ప్రాణాంతకమైన అవసరమైతే దూరంగావుండి మాట్లాడుకోవచ్చుకాని ఉత్తప్పుడు వాళ్లు సాధ్యమైనంతదూరాన్ని ఉండవలసిందే. అత్తపేరు చెప్పకూడదు కాబట్టి యాంబోనియాలోను, సీరమ్‌లోను, వేటార్‌లోను, కాఫిర్‌సులోను అతను ఆమెను 'అమ్మ' అని పేర్కొంటాడు.

అల్లుడినీడ అత్తమీందపడితే విడాకులు

న్యూసౌత్‌వేల్సులోని యూయిన్ తెగలో అల్లుడు అత్తతో ఎట్టిసంభాషణ చేయకూడదు. ఆమె ముఖం చూడకూడదు. తుదకు ఆమె ఉండేదిక్కుకు కూడా చూడకూడదు. అల్లుడినీడ కనక అత్తమీద పడితే విడాకులు ఇచ్చుకోవడానికి అదోకారణం అవుతుంది. అల్లాంటి సందర్భంలో అతడు తన భార్యకు విడాకు ఈయవలసిందే. అతనిభార్య మగణ్ణి వదలి పుట్టింటిలో వుండి పోవలసిందే.

అత్తతో మాట్లాడిన అల్లుడికి మరణశిక్ష

న్యూసౌత్‌వేల్సులోని హంటర్‌రివర్ తెగలలో అత్తతో మాటలాడిన అల్లుడికి పూర్వం మరణశిక్ష విధింపబడేది. ఇటీవల ఈ దుష్కార్యంచేసిన ఘోర పాపికి మరణశిక్ష విధించడంమాని బాగా చీవాట్లు పెట్టి కొంతకాలం తెగలోనుంచి బహిష్కృతుని చేస్తున్నారు.

అల్లుణ్ణిచూస్తే అత్తతల నెరుస్తుంది

కులూన్ తెగలో ఒకవింత నమ్మకంవుంది. అత్త తన అల్లుణ్ణికాని, అతనితమ్ముణ్ణికాని చూసినా, వారితో మాటలాడినా ఆమెతల నెరిసిపోతుందని వారు నమ్ముతారు. విక్టోరియాకు చెందిన కుర్నాయి తెగలోని స్త్రీ ఏసందర్భంలోకాని, ఎచ్చటకాని తన కూతురుమొగుణ్ణి చూడడానికి సంఘనియమం ఒప్పుకోదు. తన కూతురు మగడు తనయింట్లో

సేపూ ఆమె రగ్గుముసుగులో ఉంటుంది. వాళ్లు ఒక ఇంట్లోనే కాపరం ఉండవలసివస్తే ఆమెగదిద్వారం ఉన్న దిక్కుకు ఎదిరిదిక్కుగా అతనిగదిద్వారం ఉండాలి. రెండుగదులనడుమస్థలంలోను ఎత్తుగాను దిట్టంగాను కంచెలు పెంచాలి. ఒకర్నిఒకరు ఏవిధంగాను చూసుకోకుండా వుండడానికి తగుజాగ్రత్తలు వహించాలి. కట్టెలు మొదలైనవి ఏరుకుని తెచ్చుకోడానికి బయటికి వెళితే ఆమె ముసుగువేసుకుని వెళ్ళాలి.

## అత్తతో భాషిస్తే అల్లుడికి వణుకురోగం

యుగాండాలో మగవాడు తనఅత్తను చూడ్డంకాని ఆమెతో ముఖాముఖి మాటలాడ్డంకాని చేయకూడదు. దారిలో అనుకోకుండా తారసిల్లితే ఆమె వెంటనే వెనక్కితిరిగి తలను తనబట్టతో కప్పుకోవాలి. అట్లాకప్పుకోవడానికి తగిన పొడుగుబట్టలు కనక అప్పుడు ఆమెదగ్గరలేకపోతే ఆమె మోకాళ్ళమీద వంగుని ముఖాన్నిచేతులతో మూసుకోవాలి. ఆమెతో అతనికి మాటలాడవలసివస్తే నడుమను మూడోమనిషో, గోడో, తలుపో వుండితీరాలి. ఈ నియమాల్ని అతను ఉల్లంఘించాడా అతనికి చేతుల వణుకురోగం పట్టుకుంటుందనీ, మనిషి నీరసించిపోతాడనీ వాళ్ళనమ్మకం.

## అత్తనిచూడకుండా రోడ్డుమీద బోర్లాపడ్డం

తూర్పు ఆఫ్రికాలో ఇదివరకు జాన్జిబార్ సుల్తాను ఆధిపత్యానికిలోబడివున్న కొన్ని తెగలలోని తరుణ దంపతులు తమను ఒకపిల్లో పిల్లాడోపుట్టేవరకు తమతమ అత్తమామల్ని కలుసుకోకూడదు. మామూలు దారుల్లో వాళ్ళను కలుసుకోకుండా వుండడానికిగాను వీళ్లు చుట్టుదారులవెంట పోవాలి. ఇట్లా చుట్టుదారుల్లో తిరగడానికి శక్తిలేక మామూలుదారివెంట పోతూ ఆకస్మికంగా అత్తమామల్ని తారసిల్లడం తటస్థిస్తే వాళ్ళు కంటికి కనపడనంతదూరం సాగిపోయే ˊవరకు వీళ్ళు రోడ్డుమీద బోర్లాపడుకుని ఉండాలి.

స్త్ర ఇంట్లోకి, అల్లుడు బయటికి

ˊజాతిలో మగవాడు ఎప్పుడూ తనభార్య తల్లిని కలుసుకోకూడదు, చూడకూడదు. తనభార్యకు జబ్బుచేసి ఆమెకు సంరక్షణ చెయ్యడానికని ఆమె తల్లివస్తే అత్త ఆయింట్లో వున్నంతసేపూ అల్లుడు ఆ యిల్లువదలి దూరంగా పోవలసిందే. ఆ అత్త రాకను ఆ అల్లునికి తెలియచెయ్యడానికి అక్కడక్కడ ప్రతీహారులు నిలబెట్టబడతారు.

## మాట్లాడిన దోషానికి ఆత్మహత్య

న్యూబ్రిటన్‌లోని ఆదిమనివాసులు అల్లుడు అత్తతో మాటలాడడంవల్ల కలిగేనష్టాలయొక్క తత్వమునూ, పరిమితినీకూడా అంతుపట్టరానివిగా తలుస్తారు. అత్తా అల్లుడూ మాట్లాడుకున్న దోషానికి వాళ్ళు ఇద్దరూకాని, కనీసము ఒకరుకాని ఆత్మహత్య చేసుకోవడం సరియైన పరిహారం అని వాళ్ళనమ్మిక. న్యూబ్రిటన్‌లోని అన్నిఒట్టుల్లోనూ 'అత్తతో చేతులు కలిపినట్లు' అని చెపుతూ పెట్టుకునే ఒట్టు అతిపవిత్రమైందిగా ఎంచబడుతూవుంది. మనదేశంలో 'తల్లితోడు' అంటే ఎంతపవిత్రమైన ఒట్టో ఆదేశంలో 'అత్తతో చేతులు కలిపినట్లు' అంటే అంతపవిత్రమైన ఒట్టు.

## అత్తనడిచినమార్గాన్ని అల్లుడు పోరాదు

బ్యాంక్సుదీవుల్లోని వ్యానుయాలావాలో అత్త నడిచినమార్గాని అల్లుడు నడవడం నిషిద్ధం. అత్త సముద్రపు ఒడ్డునే నడిచివెళ్లిందనుకోండి. సముద్రం తిరిగి పోటువచ్చి అత్తయొక్క అడుగుజాడల్ని పూర్తిగా తుడిచివేసేవరకు అల్లుడికి ఎంతపనిఉన్నా ఆ మార్గాన్ని పోకూడదు.

## అత్తలదర్శనభయం బలవత్తరమైంది

అపాచీలోని ఇండియన్ యువకుడు ఒకడు తన అత్తను చూడకుండా వుండడానికని మామూలు మార్గంతప్పించి ప్రాణాపాయంగల కొండకోసల వెంబడే నడిచిపోయాడు. అతనికి అక్కడ ఏమాత్రం కాలుజారినా క్రిందపడి ప్రాణాలుకోల్పోయి ఉండును, ప్రాణాలునిలిచినా కొన్ని అవయవాలేనా ముక్కలైయుండును. దీన్నిబట్టిచూస్తే అచటి అల్లుళ్ళకు ప్రాణాపాయభయంకంటె అత్తల దర్శన

భయమే బలవత్తరమైందని స్పష్టమౌతూంది.

### ఈ కఠిననియమాలకు కారణం ఏమి?

అయితే అత్తా, అల్లుడీసందున మానవసంఘం ఇంతటి కఠినమైన నియమాలను ఎందుకు ఏర్పరచిందని సందేహం తోచకమానదు. మానవుని సాంఘిక చరిత్రవిషయంలో మంచి పరిశ్రమచేసి ఉద్గ్రంథాలు రచించిన క్రాలీ, ఫ్రేజరు పండితులు ఉభయులూ ఈ సందేహాన్ని తీర్చడానికి కొంత ప్రయత్నంచేశారు. అత్తా అల్లుడు మధ్యగల ఈ నిషేధానికి సంబంధించినభావాల్ని స్థూలదృష్టితో తిలకిస్తే మతానికి సంబంధించినవిగాను, అవి ఉల్లంఘించునపుడు కలిగే భయముకూడా మతానికి సంబంధించినదిగాను కనుపించినా సూక్ష్మదృష్టితో చూస్తే ఇది కామసంబంధమైన వాంఛలు కలుగకుండాచేసే ఆంక్ష అని నిశ్చయంగా నిర్ణయించి తీరవలసివస్తుందని క్రాలీ పండితుడు చాటుతున్నాడు. అత్తా అల్లుడి నడుమ వివిధప్రాంతాల్లోవున్న నిషేధాలని ఒక్కొక్కదానినే తీసుకొని తీవ్రంగా విమర్శిస్తే అత్తకూ అల్లుడికీ కామసంబంధమైన కోరికలు పుట్టకుండా వుండడానికే ఆదిలో ఇవి పుట్టాయని నిర్ణయంచేయక తీరదని ఫ్రేజరుపండితుని వచనము. అత్తకి అల్లుడికీ అన్యోన్యదర్శనం కాని, అన్యోన్యసంభాషణ కాని, సహపంక్తిభోజనం కాని, ఏకగృహవాసం కాని లేకుండా నిషేధించడంలో ఆదిమమానవుల ఉద్దేశం వారిపట్ల కామసంబంధమైన సాంకర్యం కలక్కుండావుండడమే అయివుంటుందనడం నిజం అని అంగీకరింపక తీరదు.

కాని నాగరికత ప్రబలిన ఈనాడు ఆ నిషేధం రచయితల అపహాసానికి ఒక సాధనసామగ్రిగా మారిపోయింది. నాగరిక మానవుని వినోదకరవిషయాలసంఖ్యను పెంచిన విషయాల్లో ఇది ఒకటిగా జమ అయింది.


## లక్ష్మీకవచము

వలయుకోరికలొసంగుటలో అమోఘము.

వలసినకార్యసాఫల్యమొనగూర్చుటలో అద్భుతము.

పరీక్షయందు తీర్ణులు కాంక్షించిన విద్యార్థులకు ప్రత్యక్ష సరస్వతి. ఉద్యోగములేక నల్లాడు వారికిఁబనిగల్పించుట యందును, కోర్టువ్యాజ్యములలో దిగుల్కొని బాధపడువారిని గెల్పొందించుట యందును, దారిద్ర్యసాగరమున క్రుంగి దరిగానక దుఃఖించువారిని లక్ష్మీప్రసన్నులుగా జేయుట యందును గొప్పకల్పవృక్షము. సంతానములేక చింతించు దంపతులకు సంతానమొసంగి సంతోషవార్ధి నోలలాడించు చింతామణి. వేయేల? ఏకోరికతో నీకవచమును ధరింతురో ఆకోరిక సమకూర్చుటలో నిలవేల్పు. ఈకవచము దైవోపాసకులచే బీజాక్షరసంయుతమై లక్ష్మీప్రతిమ నలరారునట్లుగా గల్పింపఁబడినది. దీనిని ధరించి, వలసినకార్యసాఫల్యములు పొందినవారలొసగిన యోగ్యతాపత్రములను, దీనిని ధరించవలసివచ్చినప్పుడు మీరుచేయవలసిన పూజావిధానము- లక్ష్మీస్తోత్రముగల పొత్తము మీఆర్డరుకవచముతోఁ బంపబడును.

నోటు.—లక్ష్మీప్రతిమతోగూడి బీజాక్షరసంయుతమైన యీకవచము పంచలోహ నిర్మితమైన మైలగాలిసోకిన బలము చెడకుండాయుండునటుల తావేజుగా చుట్టి ధరించుటకు వీలుగానుండులాగు కొండీలతోను, చక్కనిపట్టుత్రాడుతోను నమర్పబడి యున్నది.

వెల రూ 1—4—0. మాత్రమే. డిటో వెండిది రూ 1—12—0.

లక్ష్మీకవచనిలయం, రాజమండ్రి.

# 1999 లో నానాజాతిసమితి

రచయిత:

తోలేటి గంగాధరము, ఎం. ఏ.

[భవిష్యపురాణం వ్రాసిన వ్యాసుని సంతతికిచెందిన జి. యల్. యమ్‌గారు 'ఇండియన్ ఫినాన్సు' ద్వారా క్రీ. శ. 1999 లో యూరపు యాత్రచేసి అప్పటి తన యాత్రావివరాల్ని ఒక గ్రంథంగా ఇంగ్లీషులో వ్రాయగా అందుండి నానాజాతిసమితినిగూర్చిన ప్రకరణాన్ని ఎత్తి. తెనిగించి ఇపుడు ప్రచురిస్తున్నాను. వ్యాసులు వ్రాసిన భవిష్యపురాణాన్ని నమ్మినా నమ్మకపోయినా ఈ వ్యాసాన్నిమాత్రం నమ్మితీరాలని పాఠకుల్ని కోరుతున్నాను.]

ఈవేళ శుక్రవారం. నేను జినీవావచ్చి ఈ వేళకి సరిగ్గా వారమైంది. చూడవలసినవన్నీ చూశాను. ఇక వెళ్ళిపోదామనుకుంటూ వుండగా ఇచట పూర్వకాలంలోవుండిన నానాజాతిసమితినిగూర్చి హఠాత్తుగ నాకు జ్ఞాపకం వచ్చింది. పూర్వకాలంలో ఇక్కడ నానాజాతిసమితి అనేసభ ఒకటి సమావేశం అవుతూవుండేదనీ, వివిధదేశాల ప్రతినిధులు ఆ సమావేశానికి వస్తూవుండేవారనీ, వాళ్లు కూడబలుక్కొని శాంతిని యుద్ధాన్ని రెంటినీ ఒకేఘాటీమీద నిలిపేవారనీ నేను విని ఉన్నాను. జాతిసమితికి స్విడ్జర్లాండులోని జినీవా ప్రధానకార్యస్థానంచెయ్యడానికి కారణాలు రెండనీ, అందులో మొదటిది స్విడ్జర్లాండు సముద్రతీరాన్ని లేకపోయినా నేవల్ డిజార్మమెంటు అవలంబించడం చేతనున్నూ, రెండోది యూరపులోకల్లా స్విడ్జర్లాండులో నుంచి భోజనహోటల్లు (మదరాసులో లయొలాకాలేజిహోస్టలును మించేవి) వుండడం చేతననిన్నీ నా చిన్నతనంలో ఏదో వాచకపుస్తకంలో చదివిఉన్నాను. ఆపుస్తకంలోనే ఇచటికి ఆరోజుల్లో ఇండియాదేశాన్నుంచి కొందరు రాజులు మహారాజులు ప్రతీసంవత్సరం వచ్చేవారనీ వారితోబాటు ఇండియాఆఫీసు (ఎర్రగూడెంతాలూకాఆఫీసు కొవ్వూరులోఉన్నట్లు ఈ ఇండియాఆఫీసు లండన్‌లోవుండేది) నుంచి ఉద్యోగులు వచ్చేవారనీ, వారు ఆసమితిలో ఇండియాప్రతినిధులుగా చలికిలబడేవారనీ చదివినట్లు చూచాయగా జ్ఞాపకంవుంది. కాబట్టి వీలయితే ఆ సంస్థను చూడాలని నాకు కుతూహలం పుట్టింది.

ఆవూళ్ళోవున్న యాత్రికుల ఏజెంట్లను, మహాహోటలుమేనేజరును, బీట్‌పోలీసును జాతిసమితికార్యస్థానం ఎక్కడని విచారించాను. అల్లాంటిది ఒకటి ఆవూళ్లో వున్నట్లే తాము వినిఉండలేదని వాళ్లు అన్నారు. ఆ వూరి పెద్దల్లో కొందర్ని విచారించగా అందులో ఒకరు నాకు కాల్విన్ మహాశయుని సమాధిమందిరానికి, మఱిఒకరు అర్కియాలాజికల్ మ్యూజియముకు, వేఱొకరు అచటి జంతుప్రదర్శనశాలకు దారిచూపిం

చారు. విజయవాడలో విజయేశ్వ రాలయం ఎక్కడవుందో కూడా తెలియకుండా వుండేవారు ఎంతమంది లేరు ? కాని జినీవాలో జాతిసమితి కార్యస్థానాన్ని నేను యాదృచ్ఛకంగా కనుక్కోకలిగాను. దాని విషయమై నేను విచారించినవాడిలో ఒక టాక్సీడ్రైవరు కూడాఉన్నాడు. అతను కొన్నిఏళ్ళక్రితం ఆ పేరు ఉన్నమందిరం ఒకటి చూచివున్నానని చెప్పినాడు. దానితో నాకు కొంతధైర్యంకలిగింది అతనూ నేనూ కార్లోపడి వీధులవెంట తిరగడం ప్రారంభించాం. తిప్పితిప్పి అతను నన్నో మందిరందగ్గిరికి తీసుకువచ్చాడు.

ఆ మందిరానికి ఓపాతసైన్‌బోర్డు వుంది. నాకు కొంచెం శిలాశాసనాలు, రాగిశాసనాలు చదివే విషయంలో ప్రవేశంవుంది కాబట్టి ఆబోర్డుమీద వ్రాసివున్న అక్షరాలు కొంత కష్టంమీద చదవకలిగాను. ఎంతకష్టపడినా అసలు చదవకలిగినందుకు చాలా సంతోషించాను. 'నానాజాతిసమితి – లోనికి వచ్చుటకు మార్గము ప్రక్కసందులో మంగలిషాపు దగ్గరనుంచి కలదు.' అని ఆబోర్డు మీది అక్షరాలను చదవకలిగాను.

శాసనపరిశోధకునకు ఒక క్రొత్తవిషయం కనిపిస్తే ఎంతగా సంతోషిస్తాడో అంతకంటె హెచ్చుగానే నేను ఆసమయంలో సంతోషించాను. ప్రక్కసందులోని మంగలిషాపు దగ్గరకువెళ్లి అచటగల చీడీలుఎక్కి నేను జాతిసమితిద్వారంఎదట నిలబడి తలుపుమీద కొట్టి, గంటవాయించీ చాలాసేపు శబ్దం చేశాను. తుదకు ఒక వృద్ధుడువచ్చి ద్వారం తెరిచాడు. నేను ఎందుకువచ్చేనో తెలిసికోడానికి అతను కుతూహలపడ్డాడు. దానిపై నేను అతనికి నారాకకు కారణం చెప్పేను. అతనికి చాలా ఆశ్చర్యంవేసింది. ఎవరో ఒకరాజు హిందూదేశాన్నుంచి అప్పుడప్పుడు వస్తూవుంటాడనీ, అతనుతప్పితే ఇంకెవరూ జాతిసమితి మందిరాన్ని చూడ్డానికైనా రారనీ చెప్పేడు. జాతిసమితిమందిరం మన జమీందారుల కోటల్లాగ శిక స్తుపడిపోతోంది. ఆ మందిరం ఒక పెద్దచీకటికోణంగా వుంది. ఎక్కడచూసినా దుమ్ముదూగర వీనితో కాలుపెట్టడానికి శక్యం లేకుండ వుంది.

ఆ వృద్ధుణ్ణి మీకు ఇచ్చట ఏమి ఉద్యోగమండి అని అడిగేను. దానికి అతను జాతిసమితికి తాను సెక్రటరీ జనరల్‌నని కాని ఇపుడు జాతిసమితి పనిచేయడంలేనందున తన్ను సంరక్షకుడు అని పిలుస్తున్నారనీ చెప్పేరు. అతను పుట్టుకచేత రష్యాజాతివాడు. పెరుగ్వేలో బొలీవియాతరఫున, బొలీవియాలో పెరుగ్వేతరఫున, లిథూనియాలో యెస్థోనియాతరఫున, జెకోస్లావాకియాలో మంచూకోతరఫున, ఐర్లండులో ఇంగ్లండుతరఫున యంబాశడరుగావుండివుండి నానాజాతులనడుమ వర్తించి వర్తించి పూర్తిగా అంతర్జాతీయమహావ్యక్తి అయి అతను జాతిసమితికి సెక్రటరీజనరల్ అయినట్లు అతని సంభాషణవల్ల నేను తెలుసుకున్నాను.

లోగడ యంబాశడర్‌మహాశయుడున్నూ కొంతకాలం జాతిసమితికార్యదర్శిమహాశయుడున్నూ ప్రస్తుతం దాని సంరక్షకుడున్నూ ఐన ఆతను ఇంకాచెప్పడం ప్రారంభించాడు :

'సమితిపని ఇపుడు బాగాలేదు. రాజకీయంగాను, ఆర్థికంగాను, నైతికంగాను, ఇంకా ఇతరరీతులగాను ఇది దిగతీతలోవుంది. మొదటలో జపాన్ దీన్నివదిలేసింది. దానికి అమెరికాలో జపాన్‌ద్వేషం ప్రబలడమే కారణం అని అనుకుంటాను. ఇంతలో జర్మనీలో హీల్‌హిట్లర్ అనే మహానాయ

కుడు ఒకడు బయలుదేరేడు. వానికి జనరల్ బోరింగు అనేవాడు సహాయంఅయాడు. మూతులికే కాకుండా దేశాలికికూడా ఆ బోరింగు బోరింగులు దింపడంచేత మిగిలినదేశాలవారు బేజారెత్తిపోయారు. సమకాలిక చరిత్రకారులు వ్రాసినదాన్నిబట్టిచూస్తే ఆ రోజుల్లో ఛార్లీచాప్లిన్ అనే ఒక సినీమానటకుడువుండేవాడనీ, హిట్లర్ మీసాలు అతని మీసాల్లా వుండేవనీ, తన మీసాల్లాంటివి తన దేశంలో మరిఒకళ్ళకి ఉండడం తనదేశంవాళ్ళు చూడకూడదనీ, ఆ కారణంచేత చాప్లిన్ నటించిన ఫిల్ములను తనదేశంలోకి రానీయకుండా హిట్లరు చేశాడనీ, ఇట్లా చేయడం జాతిసమితికి ఇష్టంలేకపోయిందనీ, దాంతో అతను ఈసమితిని వదిలేసి పోయాడనీ తెలుస్తోంది.

అదీకాక ఈ సమితివాళ్ళు కొన్ని సంధిపత్రాలు మార్చాలన్నారనీ, దానికి హిట్లర్జీ (ఆర్యుడు కాబట్టి ఇట్లాపిలుద్దాం) ఒప్పుకోలేదనీ తెలుస్తోంది. తనదేశం ఆయుధస్వీకారం చేయడంవల్ల ఇతర దేశాల్లో ఆయుధవిసర్జనం జరగడంసులభమని అతను నమ్మినాడు. ఇతర దేశాలవాళ్ళుకూడా ఇది నిజమని ఒప్పుకున్నారు. యుద్ధంవల్ల కాని శాంతిరాదనీ, జాతిసమితి మొదలు సమస్తం ఒకసారి కూలిపోతే కాని పునర్నిర్మాణంనాగదనీ అతను చెబుతూ వచ్చాడు. ఏమైనా కొంతకాలానికి అతనికి తిరిగి సమితిలోచేరాలని కుతూహలం కలిగిందనీ, ఈచేరడం అందులో శాశ్వతంగా వుండిపోడానికికాకుండా అందరితోకలిసి సమావేశాలలో జాతిసమితినుంచి లేచిపోడానికనీ తేలింది. కాని జర్మనీ జాతిసమితిలో తిరిగి చేరడానికి ఫ్రాన్సు ఒప్పుకోలేదు.

ఇది ఇల్లాఉండగా పులిమీద పుట్రగా ఇటలీలో సీనర్ బెనిటోమార్కోని (ఇతన్నే మాకరోని అనికూడా అనేవారు) బయలుదేరి ఆఫ్రికాలో గొరిల్లాయుద్ధంచేసి ఆకాశంమీంచి బాంబులువేసి, విషవాయువులువదిలి నాగరికతను అంటువ్యాధిలా వ్యాపింపచేయడానికి పూనుకున్నాడు. జాతిసమితివారు అతన్ని నెమ్మదిగా చుఱుకు చూపమన్నారు. కాని అతను చుఱుగ్గా నెమ్మదిపడాలని వుద్దేశించి జాతిసమితిలో వుండీ లేకపోయినాడు. ఈలోగా శాంక్షన్లు అనే ఒకజాతితూరీగలు ఏవో బయలుదేరాయట. వాటిని ఇటలీమీదికి విసరాలని జాతిసమితిప్రయత్నిస్తే ఫ్రాంసు వానిని ఆ దేశంమీదకి పంపడం ఉపసంహరించి జర్మనీ దేశంమీదికి పంపాలనికోరింది. ఇది ఇంగ్లండుకి ఇష్టంలేకపోయింది. కాని ఇష్టంలేనట్లు చెప్పడం ఇష్టంలేక జర్మనీఫ్రాన్సులమధ్య ఆయి మాయి గారడీచేసి తాడులేకుండా బొంగరంతిప్పి, బొంగరంలేకుండా తాడుచుట్టి ఇంగ్లండు తాడుభాగోతం ఆడింది.

ఆరోజుల్లో ఇంగ్లండు విదేశాంగమంత్రి గొప్ప మేధావి అని తెలుస్తోంది. అతనిపేరు సర్ శామ్యూయల్ ఈడెను. విదేశాంగమంత్రిత్వంవహించేసరికి అతను మిక్కిలి వృద్ధుడో, మిక్కిలి యువకుడో అయివుంటాడు. రెండూ మాత్రం అయివుండడం కల్ల. నడిమివయస్సులోకూడా వుండివుండడనే చెప్పుకోవాలి. తాడుభాగోతంఆడింది ఈ మొనగాడే. ఈ భాగోతం చూడలేక ఫ్రాన్సు నెమ్మదిగా జాతిసమితినుండి ఒత్తిగిలింది.

అందుతో ఈజాతిసమితి మందిరంలో గుట్టలు గుట్టలుగా పడిఉన్న కలక్టివ్ సెక్యూరిటీ అనేది అంతా ఒక్కసారి లుంగచుట్టుకుని ఇంగ్లండుమీదపడింది. అప్పుడు జాతిసమితికి పెడతోలగివున్న దేశాలన్నీ మాండేటరీవలస రాజ్యాల్ని తమకుతిరిగి ఇవ్వడంకాని ఇంగ్లీషు

వారి వలసరాజ్యాల్ని మాండేటరీ రాజ్యాలుగా మార్చడంకాని చేయాలని కోరాయి. ఇది ఇంగ్లండుకు పట్టలేదు. జాతిసమితినివదిలిపోడానికి నిశ్చయించింది. బ్రిటీష్ వార్తాపత్రికా నిర్వాహకుల్లో శ్రేష్ఠుడైన బీవర్ గార్విన్ అనే ఆయన ఇంగ్లండుయొక్క ఈ నిశ్చయాన్ని చాలాపొగిడి పత్రికల్ని ఆవిషయంతో నింపేశాడు.

ఇపుడు జాతిసమితిలో గౌరవసభ్యదేశాలుమాత్రం ఉన్నాయి. ఆ గౌరవసభ్యదేశాలయినా మూడుమాత్రమే. అవి ఏవి అంటే: 1. అబిసీనియా, 2. మెక్సికో, 3. మాంటికార్లో. మిగిలిన సభ్యదేశాలన్నీ క్రమక్రమంగా జాతిసమితిలోనుంచి విరమించుకున్నాయి. ఇపుడు మిగిలిఉన్న ఈ మూడు సభ్యదేశాలయినా సమితికి డెలిగేట్లను కాని, ప్రతినిధుల్ని కాని, తుదకు సలహాదార్లని కాని పంపడం మానుకున్నాయి

జాతిసమితి ఆర్థికపరిస్థితులు కూడా ఏమీ బాగాలేవు. యుద్ధనామాలాని, శాంతిమాలాని జాతిసమితికి నష్టమే కలుగుతోంది. పైగా శాంక్షన్సు అనే తూరీగలు ప్రబలి చాలా అరిష్టంకలిగిస్తున్నాయి. మీదు మిక్కిలి అంతర్జాతీయఋణాలనీ, ఋణపరిష్కారములనీ, ఋణతిరస్కారములనీ ఎప్పుడూ ఋణశబ్దమే వినబడుతూంది. రిపరేషన్సు పూర్తిగా చెల్లింపబడితేకాని ఈ జాతిసమితి మందిరానికి మరామ్మత్తులు చేయ ...నికైనా తోకలేవడంలేదు. కొన్ని దేశాల ... ఖైపండ్లు గా తాము కట్టవలసివున్న ఫీజు ... ట్టడమే లేదు. కొన్నికొన్ని దేశాలు ఏదో ... కార్థం పంపుతూవచ్చేవి. ఇప్పుడు అ ... గించి పోయాయి.' అంటూ అత ... కత దీర్ఘమైన ఒకనిట్టూర్పు వదిలా

జాతిసమితి చరిత్రను యావత్తూ నాకు నిదానంగా చెప్పినందుకు సమితిసంరక్షకునికి కృతజ్ఞతాపూర్వకవందనాలు అర్పించాను. తర్వాత ఇండియాకు ప్రస్తుతంలో జాతిసమితితోగల సంబంధాన్నిగూర్చి తెలపవలసిందిగా అతన్ని కోరాను. జాతిసమితి ఇండియా సంబంధం అనేసరికల్లా అంతవరకూ తుమ్మల ముసుగులో ప్రొద్దుకూకిన మాదిరిగావున్న అతనిముఖంలో కార్తికపూర్ణిమనాటి కాంతి కలిగింది. ముసలివాడికికూడా యావనోత్సాహం కలిగింది. సంతోషం తొణికిసలాడే కంఠస్వరంతో ఇట్లా చెప్పడానికి ప్రారంభించాడు: 'ఇంతచెప్పికూడా ఇండియావిషయం చెప్పడం మరిచిపోయినందుకు మీరు నన్ను మన్నించాలి. ఇండియాదేశం ఒక్కటే ఇప్పటికికూడా జాతిసమితిలోవున్న యాక్టివ్ మెంబరు. దానికి జాతిసమితి అంటే ఉన్న అభిమానాన్ని అంతా కార్యరూపంగా చూపుతుంది. ప్రపంచంతో చేసుకునే కంట్రాక్టులన్నీ మాటపోల్లుపోకుండా నిలుపుకునే దేశం ఒక్కయిండియాదేశమే అని అందరూ ఒప్పుకున్నారు. ఈ జాతిసమితి నిర్వహణానికి ఈయవలసిన ఏడాదికంట్రిబ్యూషన్ ఇండియా క్రమంతప్పకుండా ఇప్పటికికూడా ఇస్తోవుంది. ఆదేశపు ప్రతినిధి ఏటేటా తప్పకుండా వచ్చిపోతూవుంటాడు. అతనిపేరు నాకు సరిగా జ్ఞాపకంలేదు. బహుశా జంబూమహారాజు అయివుంటాడు. అతడు జినీవాకు పెద్దపరివారంతో వస్తాడు. ఇచ్చటి ఇంటర్నేషనల్ హోటలులో 125 గదులు తనకోసం రిజర్వుచేయించుకొంటాడు. ఆ హోటల్‌యొక్క బాల్‌రూము రెండునెల్లవరకూ తానే కంట్రాక్టుకు పుచ్చుకుంటాడు. అవసరం అయితే ఆ కంట్రాక్టు పొడిగించుకోవడానికి షరతుకూడా ఆ మహా

రాజు ఉంచుకుంటాడు. అతని జలతారుతల పాగానిగూర్చి, చెమికీపనిచేసిన చొక్కాలను గూర్చి ఆరోజుల్లో స్విడ్జర్లాండులో వింత వింతగా చెప్పుకుంటారు. ప్రజలకు ఇదే ప్రస్తావన. మరోప్రస్తావన ఉండనేఉండదు. ఆరాజు పెర్సనాల్టీఅంతా అతనిదుస్తులు, అతనినగలే అని ఇచటివారు ఘనంగా చెప్పుకుంటారు. కొద్దిసంవత్సరాలకి పూర్వం ఇంగ్లీషువారు ఇండియాకు ఏదో క్రొత్తరాజ్యాంగప్రణాళిక ఇచ్చారట. దానివల్ల ఇండియాలోని సివిల్ సర్వెంట్సుయొక్క జీతాలవలె ఇండియాయొక్క జాతిసమితిసభ్యత్వంకూడా స్టాట్యుటరీ ఆబ్లిగేషన్ అయిపోయింది. ఇండియన్ ఫెడరల్ గవర్నమెంటుయొక్క గవర్నర్ జనరల్‌పై నిలిచియున్న ప్రత్యేకబాధ్యతలవల్ల ఆయన జాతిసమితిలో ఇండియాతరఫున ప్రాతినిధ్యంవహించడానికి ఒక ఇండియన్ ప్రిన్సును పంపడం తప్పనిసరి అయింది. ఇపుడు జాతిసమితి మూసివేయబడినా, అది ఏమీ కార్యకలాపం నిర్వహించుచుండకపోయినా ఇండియా దీనికి ప్రతినిధుల్ని పంపుచుండడంచేత ఇండియాకు ఇంటర్‌నేషనల్ స్టేటస్ ఏర్పడింది.' అని అతను ముగించాడు.

అందుమీద సమితిసంరక్షకుల్ని నేను ఇండియాప్రతినిధి ఎప్పుడేనా లీగ్ఎజంబ్లీ సభలకు కాని, లీగ్‌కౌన్సిలు సభలకు కాని వచ్చి పాల్గొంటాడా అని అడిగాను. దానికి అతను 'అల్లాంటిసభలేమీ ఇపుడు జరగటమే లేదు. ఇక అతనికి పాల్గొనడానికి అవకాశం ఏది! కాని ఘనతవహించిన ఆ మహారాజు జాతిసమితిభవనం ఇంకా నిలిచిఉన్నదో లేదో చూడ్డానికిగాను ఒకమారువచ్చి సందర్శిస్తూవుంటాడు' అని చెప్పినాడు. ఇంక అడగడానికికాని, చూడ్డానికికాని ఏమీ లేకపోవడంచేత అతనివద్ద సెలవుతీసుకొని బయటికివచ్చి అక్కడి మంగలిషాపులో శుభ్రంగా క్షౌరం చేయించుకొని నేను కారులో బసకు చేరుకున్నాను.


## వైద్యగ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అష్టాంగహృదయము సూత్రస్థానము | 6 | 0 | అనుపానమంజరి | 0 | 8 |
| ,, నిదానస్థానము | 2 | 0 | అనుపానరత్నాకరము | 0 | 12 |
| ,, చికిత్సాస్థానము | 4 | 8 | ,, మేలుప్రతి | 1 | 0 |
| ,, కల్పస్థానము | 1 | 12 | అనుపానతరంగిణి | 0 | 12 |
| ,, ఉత్తరస్థానము | 6 | 0 | చికిత్సారత్నము, స్త్రీరోగ బాలరోగచికిత్స | 1 | 4 |
| వైద్యచింతామణి రెండు సంపుటములు | 8 | 0 | వైద్యకాలజ్ఞానము | 0 | 4 |
| సుశ్రుతము, శారీరస్థానము ప్రాచీనము | 2 | 8 | వైద్యామ[illegible]ము (అజీర్ణమంజరి చేరినది) | 1 | 4 |
| ధన్వంతరినిఘంటువు (సవరణప్రతి) | 2 | 8 | రసరత్న[illegible]చ్చయము | 2 | 8 |
| వస్తుగుణపాఠము (గుణపాఠము) | 3 | 0 | బసవరా[illegible]ము | 7 | 0 |
| సర్వౌషధిగుణకల్పము | 2 | 8 | శార్ఙ్గధ[illegible]హిత | 8 | 0 |

పిడుగు వేంకట[illegible]ఙ్గారావు పంతులు,

1, పెద్దినాయునివీధి, మదరాసు.

# దీపావళితో దీపాలపండుగలు ప్రారంభమౌతాయి

మనపండుగులన్నిటిలోకి దీపావళి అపూర్వమైంది. మిగిలిన పండుగుల కార్యకలాపమంతా ఆయా పండుగదినాల్తో పరిసమాప్తం అవుతుంది. కాని దీపావళిపండుక్కి సంబంధించిన కార్యకలాపం దీపావళిపండుగుతో పరిసమాప్తంకాదు. ఈపండుగు ప్రారంభం చేసుకుని మరి నెలరోజులవరకూ దీపాలఉత్సవం సాగుతూనే వుంటుంది. కాబట్టే దీపావళితో దీపాలపండుగలు ప్రారంభమౌతాయి అని చెప్పడానికి కారణం అయింది,

దీపావళి (దీప+ఆవళి) అనగా దీపముల సమూహము అని అర్థము. అది దీపాలపండుగ. ఆనాడు ఆంధ్రదేశంలో ఇంటింటా ఎన్నెన్నో దీపాలు పెడతారు. తాటియాకులతో గుమ్మిడిపళ్లుచేసి వాటిలో ఉమ్మెత్తకాయలు నడిమికి కోసిన డిప్పలుఉంచి వాటిలో నూనిపోసి దీపాలుపెడతారు. కిత్తనారస్తంభాలను పాతి వాటిమీద మట్టిప్రమిదలు పెట్టి వాటిలో దీపాలుపెడతారు. అరుగులమీద, గడపలమీద, గూళ్లల్లోనూ, ఇంటికప్పులమీద ఎన్నెన్నో దీపాలుపెడతారు. అమావాస్య అయినా ఆనాడు జనపదాల్లో ఎక్కడా చీకటి అన్నది వుండదు. ఆకాశంమీది నక్షత్రాలు భూమిమీదకూడా తమ ప్రతినిధుల్ని నిలిపాయా అన్నంతగా దీపాలు నిండారుతాయి. అది దేవతలకుకూడా చూడతగిన దృశ్యం.

ఇట్లు దీపావళిపర్వంతో ప్రారంభమైన దీపాల ఉత్సవం మరి నెల్లాళ్ళవరకు సాగుతూనేవుంటుంది. దీపావళితో ఆశ్వయుజమాసం ఆఖరై కార్తికమాసం ప్రారంభమౌతుంది. కార్తికమాసం దీపాలమాసం అనేసంగతి అందరికీ తెలిసిందే.

కార్తికమాసంలో స్త్రీలు తెల్లవారగట్లనే లేచి నదికికాని కాలవకు కాని పోయి స్నానంచేసి అరటిపువ్వుడిప్పల్లోకాని దొన్నెల్లోకాని దీపాలు వెలిగించి నీటిజాలులో వదులుతారు. ఈపద్ధతికే కార్తికదీపాలని పేరు. ఈ సమయానికి ఆకాశంమీది నక్షత్రాలు ఇంకా ప్రకాశిస్తోనే వుండాలి. నీటిమీద తేలుతూ వెలుగుతూ పోయే ఈకార్తికదీపాలు ఆకాశంమీది ఆనక్షత్రాల్ని అపహసిస్తోన్నట్లు వుంటాయి. ఈదృశ్యం చూడ్డానికి చాలా మనోహరంగా వుంటుంది. కార్తికమాసంలో తెల్లవారగట్ల రాజమండ్రి గోదావరి తీరాన్ని చూసితీరాలి. తెల్లవారుజామున కొవ్వూరులో రైలుఎక్కి గోదావరివంతెన మీదుగ రాజమండ్రి గోదావరిగట్టు చూస్తే ఈదృశ్యంయొక్క మనోహరత్వం తెల్లమౌతుంది. మన పురాణాల్లో కార్తికమాస మాహాత్మ్యాన్ని తెలిపే కథల్లో చాలాభాగం గోదావరితీరాన్ని జరిగినట్లే వర్ణింపబడ్డాయి. పౌరాణికకాలంనుంచీకూడా గోదావరీతీరం ఈకార్తికదీపాలవ్రతానికి పేరుమోసి వుంది.

తెల్లవారగట్ల ఈదీపాలు, సాయంకాలం కూడా దీపాలున్నాయి. కార్తికమాసం నెలరోజులూ ప్రతి సాయంకాలము ప్రతి శివాలయంలోను ధ్వజస్తంభానికి ఆకాశదీపం వ్రేలాడతీస్తారు. ఇట్లా ఈ దీపాన్ని పెట్టినవారికిన్నీ దానిని చూచినవారికిన్నీ పాపాలు నశిస్తాయని మన పురాణాలు చెపుతున్నాయి. ఈమాసంలో దేవాలయాల్లో దీపారాధన చేసినవారికి పుణ్యలోకప్రాప్తి కలుగుతుందని మన పురాణాలు చాటుతున్నాయి.

మునిప్రొద్దున, మునిచీకటివేళ పెట్టే ఈ దీపాల్ని మించింది అఖండదీపం. కార్తిక మాసం ముప్ఫయిరోజులు రాత్రింబగళ్లు ఆరిపోకుండా ఎడతెగకుండా అఖండంగా వెలిగించే దీపాదీపానికి అఖండదీపం అనిపేరు.

అఖండదీపంగాక కార్తికమాసపు దీపాదీపాలలో ఏకోత్తరదీపం ఒకటి. కార్తిక మాసం తొలిరోజున ఒకవత్తితో ప్రారంభం చేసి క్రమక్రమంగా దినదినమూ రెట్టింపు వత్తులతో వెలిగిస్తూవచ్చే దీపానికి ఏకోత్తర దీపం అని పేరు.

కార్తికమాసంలో ప్రతినిత్యమూ చేయతగిన దీపవ్రతాల్లో ఇవిగాక దీపదానవ్రతం అనేది ఒకటి. కార్తికమాసంలో ప్రతిసాయంత్రమూ బియ్యపుపిండితోకాని గోమయంతోకాని పాత్రనుచేసి అందు నేతితో దీపంపెట్టి బ్రాహ్మణ్ణిపూజించి అతనికి దానంచేస్తూరావలెను. నెల చివరరోజున బంగారుపాత్రలోకాని వెండిపాత్రలోకాని దీపాన్నిపెట్టి దానిని బియ్యపుపిండి నడుమలో ఉంచి దానం చేయవలెను. తరువాత బ్రాహ్మణసమారాధన చేయవలెను. ఇట్లు చేసిన స్త్రీపురుషులు పుణ్యాలోకాన్ని పొందుతారు.

ఇట్లు నిత్యమూ చేసే దీపవ్రతాలుకాక కార్తికమాసంలో కొన్నికొన్నిరోజుల్లో చేసే దీపవ్రతాలు కూడా ఉన్నాయి. అందులో మొదటిది క్షీరాబ్ధిద్వాదశినాటి దీపవ్రతం. ఆషాఢమాసం శుక్లపక్షదశమిరోజున శ్రీమహావిష్ణువు లక్ష్మితోకూడి పాలసముద్రంలో పాపపాన్పుమీద పవ్వళించి నాలుగుమాసాలు నిద్రపోయి తిరిగి కార్తికశుద్ధద్వాదశినాడు మేలుకొనును. ఆరోజును క్షీరాబ్ధిద్వాదశి అనీ, హరిబోధిని అనీ అంటారు. ఆనాడు తులసికోటలో కాయలుగల ఉసిరికకొమ్మను పాతి సాయంకాలం అచట దీపాలు వెలిగించి పూజచేస్తారు. ఉసిరిక కాయలను నడిమికికోసి నడుమను డొల్లచేసి అందు ఆవు నేతితో దీపాలు పెడతారు.

క్షీరాబ్ధిద్వాదశి వెళ్ళిన మూడురోజులికి కార్తికపూర్ణిమ. ఈ కార్తికపూర్ణిమను దక్షిణాదిని కార్తికదీపం అంటారు. ఈనాడు ప్రతి గృహస్థు తనయింటిలో పెట్టగలిగినన్ని దీపాలు పెడతాడు. స్త్రీలు 360 వత్తులతో మునికార్తిదీపం వెలిగిస్తారు. ఏడాదిలోని మూడు వందల అరవైరోజులకు రోజు ఒకటికి ఒక వత్తిచొప్పున మూడువందల అరవైవత్తులు. మదరాసు దగ్గఱ తిరువన్నామలై అనే యాత్రాస్థలంవుంది. అచటి దేవాలయంలో అఖండమైన కార్తికదీపం వెలిగిస్తారు. వేలకొలది యాత్రికులు వస్తారు. ప్రతియాత్రికుడూ అందులో కర్పూరం వెయ్యడంకాని, నూని పొయ్యడంకాని చేస్తాడు. అంతుతో అది ఆకాశంఅంటే బ్రహ్మాండమగు దివ్యజ్యోతి అవుతుంది. ఆదీపం వెలిగే స్థలానికి పైన ఏమీ ఆచ్ఛాదనంవుండదు. అయినప్పటికీ తుపాను గాలి వీచినా, రోకళ్ళలావు ధారలతో వర్షించినా ఆరిపోవనంతటి పెద్దదీపంగా అది ప్రజ్వరిల్లుతుంది.

క్షీరాబ్ధిద్వాదశి విష్ణుసంబంధమైన పండుగ, కార్తికపూర్ణిమ శివసంబంధమైన పర్వము. ఇట్లు దీపాలపండుగలు శివవిష్ణువుల ఇద్దరి పరంగాను విలసిల్లుతూవున్నాయి. అయినా ఈ పండుగులు అన్నిటిలోకి దీపావళి దివ్యమైంది, అగ్రగణ్యమైంది, ఉత్సాహాతిశయమైంది. దీపాలఋతువుకు దీపావళిపురోగామి.

ఈ ఒక్కమాసంలో ఇన్ని పండుగులు దీపాలకు సంబంధించినవి ఏర్పాటుచేయడంలో మన పెద్దల ఉద్దేశం ఏమైవుండునో?

**THE SOUTH INDIA CO-OPERATIVE INSURANCE SOCIETY, LTD.,**

**MADRAS.**

# ది సౌత్ ఇండియా కో-ఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటీ, లిమిటెడ్.

హెడ్డాఫీసు : మద్రాసు. పోస్టుబాక్సు నెం : 182.

(1) సహకారధర్మములమీద స్థాపింపబడినది.

(2) రాజధానిలోని ప్రసిద్ధ సహకారనాయకులచే నడపబడుచున్నది.

(3) రు 100 లు మొదలు రు 5000 లు వరకు పాలసీలు జారీచేయబడును.

(4) పాలసీదారులే వాటాదారులు.

(5) ప్రీమియము రేట్లు చాల తక్కువ.

(6) ప్రీమియములను రాజధానిలోని కోఆపరేటివు బ్యాంకులలో చెల్లింపవచ్చును.

(7) ఆటోమాటిక్ నాన్ ఫర్ఫీచరు సౌకర్యముగలదు.

(8) స్త్రీజీవితభీమా యంగీకరింపబడును.

వివరములకు హెడ్డాఫీసునకుగాని, యీ క్రింది ఆర్గనైజర్లకుగాని ఏజంట్లకుగాని వ్రాసి తెలిసికొనవచ్చును.

గంజాం ... డి. కృష్ణమూర్తిగారు, ఆర్గనైజరు, మిలిటరీలైన్సు, బరంపురం.

విశాఖపట్టణం ... ఎ. వీరరాజుగారు, మానేజరు, విజయనగరం కోఆపరేటివు సెంట్రలుబ్యాంకి, విశాఖపట్టణం బ్రాంచి, విశాఖపట్టణం.

తూర్పుగోదావరి... పాణంగిపల్లి సత్యనారాయణగారు, ఇన్స్పెక్టరు, రామచంద్రపురం.

పశ్చిమగోదావరి... టి. కుటుంబశాస్త్రిగారు, ఆర్గనైజరు, నిడదవోలు.

కృష్ణా ... జి. రాఘవశర్మగారు, ఛీఫ్ ఏజంటు, గుడ్లవల్లేరు.

నెల్లూరు ... ఎ. సుబ్రహ్మణ్యంగారు, ఆర్గనైజరు. [illegible] ుం. వి. అగ్రహారం, నెల్లూరు.

అనంతపురం ... ఎ. నారాయణప్పగారు, ఛీఫ్ ఏజంటు, అనంతపురం.

బళ్లారి ... యస్. ఆర్. సుబ్రహ్మణ్యముగారు, జిల్లాఆర్గనైజర్, హాస్పేట.

# జర్మన్ నియంత హిట్లర్ రక్తపిపాసగల వేటకుక్క

రచయిత:

కాగితం వెంకటరత్నం, ఎల్. ఐ. ఎం.

ఒక దేశముయొక్కగాని, జాతియొక్కగాని, సంఘముయొక్కగాని అభివృద్ధి ఒక ఆదర్శనీయమైన నాయకునిమీద ఆధారపడి వుంటుంది. ప్రపంచములో ప్రతికాలములోను కొందరు ఆదర్శప్రాయమైన మహానాయకులు వుంటారు. వారు సామాన్యమానవులవలె ఆహారనిద్రలతో, ఆలుబిడ్డలతో సంతృప్తిచెందక ఉన్నతాశయములు కలిగి దేశోద్ధారణకై పాటుపడెదరు. దేశకష్టములను, సంఘదురాచారములను దెలిసికొని అంధకారములోపడి పశుప్రాయులవలె నున్నవారిని సరియగుబాటమీద ప్రవేశపెట్టి మానవాభ్యుదయమునకు సహాయపడెదరు. వారి జీవితచరిత్రలు వారు నివసించు ఆయాదేశముల యొక్క దేశచరిత్ర లనవచ్చు. ఆధునికప్రపంచములోని అలాంటిదేశనాయకులలో 'ఎడాల్ఫుహిట్లరు'కు అగ్రతాంబూలంఇయ్యవచ్చు. ఈతడు జర్మన్ దేశనియంత. జర్మనీజాతీయోద్యమమునకు మూలకందం. నాజీపక్షనిర్మాత. గత ఐరోపామహాసంగ్రామాంతరం జర్మనీదేశము బహుక్లిష్ట పరిస్థితులలో పడినది. ప్రభుత్వము దేశపీడతొలగించు నుపాయముల నన్వేషించి అవలంబించుటకు అసమర్థమైనది. అట్టి సమయమున దేశములోని కంటకములను సమూలంగా పెకలించి ప్రజకు ఆమోదముగురీతిని పునర్నిర్మా ణ గడంగిన మహావ్యక్తి హిట్లర్. అప్ప ుపితృదేశసేవానిరతుడు. పరాక్రమశాలి. అన్నవస్త్రములకు కరువై కడునిరుపేదగనున్న ఆతడు నేడు ఏకచ్ఛత్రాధిపతివలె జర్మనీసామ్రాజ్యమును అవిచ్ఛిన్నముగ, అజేయముగ ఏలుచున్నాడు.

హిట్లరు జననం 20-4-1889. బవేరియా సరిహద్దు ప్రాంతములలోగల 'బ్రానా' నగరమాతని జన్మస్థలం. సామాన్య కుటుంబములోనివాడు. తల్లి బొహిమియాదేశస్త్రీ. చిత్రకళాభిమానురాలు. తండ్రి ఆస్ట్రియాదేశీయుడు. ఈతడు కస్టమ్స్ ఆఫీసులో ఉద్యోగి. ఉద్యోగరీత్యా తన విధ్యుక్తధర్మములను నెరవేర్చడంలో ప్రజానుకూలత్వం చూపించేవాడు. అందుచే సర్వజనరంజకుడై వొప్పారుతూవుండేవాడు. ఈతనికి పెద్దపెద్ద ఆశయములుండేవి. కొమరుడైన హిట్లరు పెద్ద ప్రభుత్వాధికారి కావలెనని అభిలాషవుండేది. కాని హిట్లరుకుమాత్రం తండ్రి అభిలాష రుచించలేదు. హిట్లరు కళారాధకుడు. అందుచేత తన కళాకౌశాల్యాన్ని అభివృద్ధిజేసుకుందామనే కుతూహలంవుండేది. ఈతని పన్నెండవయేట 'లిన్జ్' అనే పట్టణములో గ్రామరు స్కూలులో చేర్చిరి. కాని స్వేచ్ఛాప్రియుడగు నాతనికి పాఠశాల నిబంధనలు నచ్చలేదు. అచటి విద్యావిధానము తనకు సరియగునదికాదని అతని నమ్మిక. పాఠశాలవిద్యాక్రమానికి ఆతనికి సంబంధమువుండేదికాదు. అల్లరిచిల్లరగా వ్యవహరించేవాడు. కాని డ్రాయింగు, హిస్టరీలుమాత్రం బాగా నేర్చుకోవాలనే జిజ్ఞాసవుండేది. వాటివిషయమై తగు కృషి

సల్పేవాడు. తండ్రికి యీరెండు గిట్టవు. సరే. కొడుకు మొండి. పాపం తండ్రి యేంజేస్తాడు? నయానా భయానా చెప్పిచూశాడు. కాని వినలేదు. వినలేదుగదా అని ఎంతసంతాపకోపాలువచ్చినా తండ్రి హిట్లర్ని చేయిచేసుకుని యెరుగడు. ఎందుకంటే పిల్లల్నికొట్టడం వాళ్ళని చేతులార చెడకొట్టడమనిన్నీ, వాళ్లకు సహజంగావుండే సౌహృదయం, మొద్దుబారుతుందనిన్నీ, కొట్టినంతమాత్రమున బాగుపడరనిన్నీ, పైగా మరింత మొండితనం హెచ్చువుతుందనిన్నీ అతని గాఢమైన నమ్మిక. అది నిజంకూడాను.

జన్మించినది ఆస్ట్రియాదేశమైననూ చిన్నప్పటినుంచి హిట్లరుకు స్వక్షేత్రాభిమానం లేదు. జర్మనీ అంటే అపారమైనప్రేమే. తానెపుడు జర్మన్‌వ్యక్తిగనే భావించెను. అతడు చదువుకునే పాఠశాలలో హిస్టరీకి 'ప్రొఫెసరు పొయిట్చ్' అనే వుపాధ్యాయుడు వుండేవాడు. ఈతడు జర్మనీదేశీయుడు, స్వక్షేత్రాభిమానం హెచ్చు. హిట్లరుకు జర్మనీదేశస్థుల నాగరికత, జాతీయతాప్రాశస్త్యం గురించి నూరిపోసేవాడు. అలగ్జాండరు, స్కిపియో ఆఫ్రికేనస్, చార్లీమాన్, ఫ్రెడరిక్ ది గ్రేట్ యిత్యాది మహావీరుల జీవితచరిత్రలు; మానవాభ్యున్నతికి వారేవిధంగా పాటుపడిందీ; వారి సాహసకార్యాలు; ధైర్యస్థైర్యాలు వీనినిగురించి ప్రబోధనచేసేవాడు. అప్పటినుంచి హిట్లరుకు దేశముకొరకు జాతికొరకు ప్రాణాలు ధారవోసినవీరులన్న పూజ్యభావం వుదయించింది. తానుగూడ దేశసేవసల్పి తన జన్మసఫలీకృతం చేసుకుందామనే సంకల్పం జనించింది.

హిట్లరు స్వేచ్ఛాజీవి, నిర్విచారి. భగవంతునకు సహితం యీర్ష్యజనించింది. హిట్లరికి పదహారవసంవత్సరం సమీపించింది. తండ్రి పరలోకగతుడాయెను. పిత్రార్జితం యేమీ లేదు. దుఃఖసముద్రమున మునిగిన మాతాపుత్రులు దుర్భరదరిద్రావస్థలో చిక్కుకున్నారు. కుటుంబపోషణావశ్యకత హిట్లరుమీద పడింది. చదువు మానివేయవలసివచ్చింది. వేడిచెమటలనోడ్చి పొట్టపోసుకోవడమే నిత్యకర్మమైంది. ఏదినం రెక్కలాడకున్న ఆదినం మాతాపుత్రులు పస్తు. తల్లికి హిట్లరంటే తగనిప్రాణం. ఒక్కొక్కప్పుడు తల్లి వుపవాసంసల్పి నోరుకట్టుకుని కొమరుని పోషించేది. హిట్లరుకు కూడా తల్లియందు ప్రేమ అధికం.

ఒకసంవత్సరం గడిచింది. దారిద్రపీడ వారిని వదలలేదు. కూడు గుడ్డలకు నోచుకొనక క్షుద్బాధచే కృశించికృశించి హిట్లరుయొక్క తల్లిగూడ స్వర్గస్థురాలైంది. హిట్లరు దుఃఖానికి అంతులేదు. దిక్కులేనివాడైనాడు. సహాయము చేయువారు లేరైరి. తల్లి అంత్యకర్మలు జరుపుటకు సహితం తగు ధనం లేకపోయింది. అప్పుచేసి అంత్యకర్మలు జరుపగలిగెను. ఉన్నఆస్తినమ్మి అప్పులు తీర్చివేయగా చివరికి చేతిలో కొన్ని పౌండ్లుమాత్రం మిగిలినవి. జీవనోపాధి వెతుక్కోవడానికై ఆస్ట్రియా రాజధానియగు వియన్నానగరమునకు చేరెను.

వియన్నాలో ఒక చిత్రకళాశాలవుంది. అందులో స్కాలరుషిప్పును సంపాదించి, కళాభివృద్ధిచేసుకుందామనే వుత్సాహంతో హిట్లరు చాలకష్టపడి చక్కని చిత్రాల్నిగీచి కళాశాలకు బహూకరించెను. కాని అతని శ్రమ ఫలించలేదు. తనవద్దఉన్న డబ్బంతయు అయిపోయింది. పనిచేసి బ్రతుకుదామంటే పని దొరకటంలేదు. చిత్రాలుగీచి

జీవిద్దామంటే వాటివిలువ ఆదేశీయులకు తెలియడంలేదు. జీవనం గడవడం దుర్భరమైంది. ఉండటానికి యిల్లులేక, పరుండటానికి ఒక తావులేక, కట్టడానికి తగు గుడ్డలు లేక తినడానికి సరైనతిండిలేక హిట్లరు పాపం పడరానికష్టాలు పడవలసివచ్చింది. ఆస్ట్రియా దేశీయులు బహుధార్మికులు, దయార్ద్ర హృదయులు, వారిధర్మములమీద బ్రతుకవచ్చు. కాని హిట్లరుకు యిష్టంలేదు. కాయకష్టపడి జీవించవలెనని పట్టుదల. స్వతంత్ర జీవనం గడపాలని వాంఛ. దైవవశాత్తు అప్పుడప్పుడు కొంచెం పనిదొరికేది. కొంత కాలం గోడలను కట్టేపని దొరికింది. కొంత కాలం యిండ్లకు రంగువేసేపని దొరికింది. ఈ విధంగా హిట్లరుకు గృహనిర్మాణంలో ప్రవేశం బాగా కల్గింది పనివున్న దినములలో కొంచెం తీరుబాటు చిక్కితే హిట్లరు పెద్దపెద్ద యింజినీరుప్లాన్లు వేసేవాడు. తగిన పనిదొరకక తిండికి తిప్పలైనపుడు కూలినాలి చేసి జీవితం గడిపేవాడు. ఎన్నికష్టాల్ని అనుభవిస్తున్నా చదువుకోవాలని హిట్లరుకు చాల కుతూహలంవుండేది. ఉపవాసాలుచేసి డబ్బు మిగిల్చి చిన్నచిన్న పుస్తకాల్ని కొని చదువుకునేవాడు. విద్యాధికుల్నిగాంచి అసూయపడేవాడు - తనకు వున్నతవిద్య ప్రాప్తించలేదు గదా అని. తనయావనమంతయు పొట్టకూటి పోరాటంతో పోతున్నదేగాని, సద్వినియోగం గావడంలేదని దుఃఖించేవాడు.

ఆరోజులలో సోషలిజమ్ దేశమంతా వ్యాపించకపోయినను పెద్దపట్టణములయందు మాత్రం ప్రాకింది. కారల్ మార్క్స అనేజ్యూ రాజకీయవేత్తయొక్క తత్వమే సోషలిజమ్--- జ్యూయిష్ సోషలిజమ్. దానికి సామ్రాజ్య తత్వం సరిపడదు. ప్రయివేటుఆస్థి పనికిరాదు. సంఘవాదములకుగాని తెగలకక్షలకుగాని ఎడమీయదు. వ్యక్తిత్వతారతమ్యములకు తావివ్వదు. మానవభ్రాతృత్వం మహత్తరమైన ఆదర్శమంటుంది. కర్షకకార్మికులు దాని అభిమానులు. హిట్లరు వారి మధ్యనుండుటచే సోషలిజమ్ గురించి తర్కవితర్కములు గావించేవాడు. సోషలిస్టు మిత్రులు తమపక్షంలో చేరమని హిట్లర్ని బలవంతపరిచేరు. హిట్లరు రోమను క్యాతలిక్ మతస్థుడు. కారల్ మార్క్సయొక్క అంతర్జాతీయసోషలిజమ్ క్రైస్తవమతనైతికసూత్రములకు భిన్నంగా కన్పించినది. స్టేటు చర్చిల మీద సోషలిస్టుల దాడి అతనికి నచ్చలేదు. వారు వాటిని ఖండిస్తుంటే హిట్లరు మనస్సు నొచ్చుకునేది. బీదలన్న హిట్లరుకు చాల దయ. కాని సోషలిజమ్ను ఆరాధించుట దేశశాంతికి భంగకరమని వారిమీద కోపం. అయినా సోషలిజమ్యొక్క నిజానిజములు పూర్తిగా పరిశీలించిగాని యేనిశ్చయమునకు రాజాలనని- వారిపార్టీలో చేరమని కోరుచున్న సోషలిస్టు మిత్రులకు హిట్లరు నిష్కర్షగా చెప్పెను.

వియన్నాలో క్రిష్టియను సోషలిస్టుపార్టీ వుండి. ఇది జ్యూయిష్ సోషలిజమ్ను సమ్మతింపదు. పూర్వం క్రైస్తవమతాధికారులు రాజకీయవ్యవహారములలో జోక్యం కలుగచేసుకునేవారు. 1891 వ సంవత్సరములో పదమూడవ పోపు 'లియో' అను నతడు క్రైస్తవమతధర్మములను ఆధారంగా తీసుకుని సాంఘిక, ఆర్థిక, రాజకీయసూత్రములను నిర్ణయించి 'రీరమ్ నోవేరమ్' అనే ప్రణాలికను ప్రచురించెను. ఈసూత్రములనే గైకొని క్రిష్టియన్ సోషలిస్టు పార్టీ స్థాపించబడింది. హిట్లరు జీవితపథంలో పోపురియో

గారి ప్రచురణ చాలముఖ్యం. ఏపార్టీనితాను స్థాపించి హిట్లరు జర్మనీనియంతగా నియమింపబడి అఖండప్రఖ్యాతి బడయగలిగెనో ఆపార్టీ – నేషనల్ సోషలిస్టుపార్టీ – యొక్క ఆర్థిక, సామాజికపునాదులు రీరమ్ నొవేరమ్‌నుండి సంగ్రహించబడినవి. సోషలిజమ్ మంచి చెడ్డలు తెలుసుకొనవలెననే పరిశీలనాభావం జనించుటచే హిట్లరు క్రిస్టియన్ సోషలిస్టు పార్టీవారివద్దకు వెళ్ళెను. వీరిబోధనలు సమంజసముగ కన్పించినవి. అప్పటినుంచి ఆ పార్టీవారి పత్రికలు ప్రచురణలు చదువుటకారంభించెను. పార్టీసభలకు వెళ్ళెడివాడు. కొంతకాలం అయ్యేసరికి పార్టీచర్చలలో సహితం హిట్లరు పాల్గొనడం జరిగింది. ఈ సందర్భములో వియన్నామేయరగు 'కారల్ లూగర్' స్నేహం కుదిరింది. ఈమహాశయుని ద్వారానే ప్రప్రథమున హిట్లరు యూదులన్న అసహ్యించుకోవడం నేర్చుకున్నాడు. వియన్నానగరమంతయు యూదులమయం. బ్యాంకులు, ఫ్యాక్టరీలు, థియేటర్లు, పత్రికలు వారివి. వ్యాపారం వారిది. విద్యాధికులు వారే. తమదేశాన్ని యూదులు పీల్చి పిప్పి చేస్తున్నట్టు అతడు గ్రహించెను. దేశదుర్భిక్షమునకుయూదులే కారకులని కారల్‌లూగర్ చెప్పినది నిజమని నమ్మెను. అప్పటినుంచియు హిట్లరుకు యూదులన్న ద్వేషభావం ఏర్పడింది.

కొంతకాలమైనపిదప వియన్నావదలి హిట్లరు మ్యూనిచ్ నగరమునకు చేరుకొనెను. ఇది బవేరియారాష్ట్రమునకు ముఖ్యపట్టణం. జర్మన్ సామ్రాజ్యమంతటిలోకి యిచట కళాభిమానం మెండు. హిట్లరు తన చిత్రకళా నైపుణ్యము నచట అభివృద్ధిచేసుకొనుటకు మార్గము లుండవచ్చునని తలంచెను. అప్పటికి యింకా దరిద్రదేవత హిట్లర్ని వీడలేదు. స్వార్జితం చేతిలో చిల్లిగవ్వలేదు. అందుచే వడ్రంగిపనిచేసి జీవనం గడిపేవాడు. అప్పుడప్పుడు కొంత డబ్బును మిగిల్చి రంగులు తెచ్చి వ్యవధి చిక్కినపుడు చక్కని చిత్రాల్ని గీచేవాడు. వాటిని కళాభిమానులకు,పత్రికలకు అమ్మగలిగెను. ఎలాగైనా మ్యూనిచ్‌లో మొదటి రెండు ఏండ్లును పొట్టగడచుటకు కష్టంగానే వుండేది.

1914 వ సంవత్సరంలో ఐరోపామహాసంగ్రామం వచ్చింది. జర్మన్ పక్షమున పోరుసల్పుటకై దేశములోవున్న పిన్నపెద్దలు అత్యుత్సాహంతో రణరంగమున కురుకుచుండిరి. సహజదేశభక్తుడైన హిట్లరుకు సమయం చేజిక్కినది. వెంటనే బవేరియన్ మినిస్ట్రీ ఆఫ్ వార్ వద్దకు వెళ్ళగా అతనిని పదహారవ యిన్‌ఫెన్‌టరీ అయిన 'లిస్టు' రిజిమెంటులో చేర్చిరి. నాలుగు సంవత్సరములపాటు యుద్ధంలో పనిజేసిననూ లాన్సుకార్పొరల్, క్రెంచి రన్నరు హోదాలకంటె ఎక్కువ పదవులు లభించలేదు. కాని రణరంగమున హిట్లరుయొక్క యుద్ధకౌశల్యమును, ధైర్యస్థైర్యములను కాంచి ఆశ్చర్యపడనివారు లేరైరి. క్రెంచిరన్నరుపని బహు అపాయకరమైనది. క్రెంచిలలోనుండి యుద్ధంచేయువారి వార్తలు ఎప్పటికప్పుడు మిలిటరీ రిజిమెంటు హెడ్ క్వార్టర్సు ఆఫీసుకు అందజేయాలి. ఈ వుద్యోగంలో వున్నపుడు హిట్లరు అనేకసార్లు చావు తప్పి బయటపడెను. అన్నిసార్లు చావు తప్పిపోవడంవలన భగవంతుడు తనయందున్నాడనియు, అందుచే తాను తలపెట్టిన కార్యములు నిర్విఘ్నముగ కొనసాగగలవనియు ఆత్మవిశ్వాసం అతనికి వుండేది. ఒకనాడు హిట్లరు బ్రిటిషుబాంబులగురినుండి తెలివితేటలుగా తప్పించుకుని చాలముఖ్యమైన

యుద్ధవార్తలను అందజేసెను. మిలిటరీ అధికారులు సంతోషించి హిట్లర్ని ఐరన్ క్రాస్ పతకముతో గౌరవించిరి.

1916, అక్టోబరు నెలలో బ్రిటీషువారు 'లీసార్స్' అనే పట్టణాన్ని ఆక్రమించుకున్నారు. ఆయుద్ధంలో హిట్లరు క్షతగాత్రుడగుటచే బెర్లిన్ నగరసమీపమున బీలిట్స్ లోవున్న వైద్యశాలకు పంపబడెను. స్వస్థత చేకూరినపిదప విశ్రాంతి తీసుకోడానికై కొన్ని దినాలు మ్యూనిచ్, బెర్లిన్ నగరములలో కాలంగడిపెను. అప్పుడు జర్మనీ దేశస్థితిగతులు పరిశీలన చేయుట సాగించెను. ఎచ్చట చూచినను యూదులే. జర్మన్ ప్రభుత్వశాఖలో వున్న యూదులు ద్రోహము తలపెట్టుచుండిరని వార్త హిట్లరుచెవుల్లో పడింది. దేశమంతా అరాచకం ప్రబలింది. ప్రజలు శాంతికై పరితపించి పోతున్నట్లు గ్రహించెను. జర్మన్ దుస్థితికి కారకులైన యూదులికి తగిన శాస్తిచేయ సమకట్టెను. విశ్రాంతి ముగిసిన పిదప వుత్సాహంగా హిట్లరు యుద్ధభూమికి వెళ్ళెను.

1918, అక్టోబరు పదమూడవ తేదీన బ్రిటిషువారు 'ఎప్రెస్' నగర పశ్చిమభాగమున విషవాయువును ప్రయోగించిరి. విషవాయువు హిట్లరు కండ్లలోనికి పోవుటచే అప్పటికి అంధుడాయెను. జర్మనీ తూర్పుదిశనున్న పాసివాక్ నగరముననున్న వైద్యశాలయందు చేర్చబడెను. ఆసంవత్సరం నవంబరు నెలలో ఒకరోజు హాస్పిటల్ చాప్లిన్ హిట్లరువద్దకు వచ్చి జర్మనులు వోడిరనియు, రష్యా బొల్షివిక్ పద్ధతులపై జర్మన్ రాజ్యనిర్మాణము గావింపబడుననియు తెలియజేసెను. జర్మనీకి అపజయం కల్గునని హిట్లరు కలనైన అనుకోలేదు. దుర్వార్త వినుసరికి పాపం ఆయంధుని నయనద్వయంనుండి అశ్రువులు బొటబొట కారినయి. బాలునివలె శోకించెను. తాను విగతజీవుడగు లోపుగ జర్మనీదేశమును, జాతిని నలుగురిలో సమానగౌరవమును బడయునటుల జేసి తీరెదనని బద్ధకంకణుడాయెను. ఆనాటి అశ్రుకణములు అంధత్వమును మాన్పు ప్రక్రియ అనదగురీతి ఆశ్చర్యముగా హిట్లరు దృష్టి తిరిగి ప్రసాదితమైంది. కాలయాపనచేయక వెంటనే తానిదివరలో పనిజేసిన సైనికదళమును చేరుటకై మ్యూనిచ్ నగరమునకు వెళ్ళెను. అచట మిలిటరీ అధికారంవారు సైనికదళములకు రాజకీయ విద్యను గరపుచుండిరి. ఆవిద్యయందు హిట్లరు అచిరకాలములో డిప్లొమాను సంపాదించగలిగి 41 వ నెంబరు రిజిమెంటుకు ఉపాధ్యాయుడుగా నియమింపబడెను. మరియు మ్యూనిచ్ నగరమందలి బీర్ హాల్సునందు జరుగు వార్తలను అధికారవర్గమునకు తెలియజేయు పని కూడ అతనిపై ఉంచబడెను.

దేశమంతయు యుద్ధము, విప్లవములచే పీల్చి పిప్పిచేయబడియుండెను. దరిద్రము తాండవమాడుచుండెను. ఎక్కడచూచినా అల్లకల్లోలం; అరాచకం; అధికారధిక్కారము. బోల్షివిజము అతిరయమున విజృంభించుచుండెను. ప్రజలు శాంతికై తహతహలాడు చుండిరి. దేశమునంగల యువకులలో నూతన భావములు మొలకలెత్త దొడంగెను. స్వయం సంరక్షణ సంఘములు బయలుదేరెను. దేశమును విషమపరిస్థితులనుండి తప్పించుటకై మార్గములను వెతకుచుండిరి. సభలు మీద సభలు జరుగుచుండెను. ఒకనాడు అతను జర్మన్ లేబరుపార్టీ వారిసభకు వెళ్ళడం తటస్థించింది. అధ్యక్షతవహించిన ఒక ప్రొఫెసరు బెర్లిననగరములో జరిగే దురాగత

ములే జర్మన్ సామ్రాజ్యపతనమునకు కారణమనియు, సామ్యవాదులు యూదులు దానికంతకును కారకులనియు, కనుక వారిని దేశబహిష్కారము గావింపవలసిన అవసరమున్నదనియు ఉపన్యసించెను. ఈ ఉపన్యాసం హిట్లరు అనుమానములను బలపరచెను. సభానంతరం ఆతడు బైటకు వచ్చుటతోడనే ఒక కరపత్రం అందజేయబడెను. ఆలోచనానిమగ్నుడైన హిట్లరు దానిని గమనించక నిర్లక్ష్యముగ జేబులోకి త్రోసెను.

కొన్ని దినములు గడిచెను. హిట్లరువుండే తావులో రెండు ఎలుకలు వున్నవి. యుద్ధానంతరం తినుబండారములు కరువగుటచే వాటికి తగు ఆహారంలేక బాధపడేవి. హిట్లరుకు జాలివేసి రోజూ తానుభుజించి ఆహారపదార్థములను వాటికివేసి అవి తింటూవుండగా చూచి ఆనందించేవాడు. అందుచే అవి చనువుగా హిట్లరువద్ద ఆడుకుంటూవుండేవి. ఒకనాడు ఎలుకలగోడవ యెక్కువైంది. హిట్లరుకు నిద్రాభంగమైంది. కాలం యేవిధంగా సద్వినియోగంచేయడమా అని జేబులో చేయిజొనిపి ఆలోచిస్తూవుండగా జేబులో చిన్నకరపత్రందొరికింది. అది జర్మన్ లేబరుపార్టీవారి ప్రణాళిక. అదే ఆనాడు సభానంతరం యివ్వబడిన కరపత్రం. దాని ననుసరించే హిట్లరు నేషనల్ సోషలిస్టుపార్టీ యొక్క ప్రణాళికను తయారుచేయించెను. జర్మన్ లేబరుపార్టీ వారి ఆశయములు ఆకర్షనీయమై ఆచరణయుక్తముగనుండెను. అందుచే హిట్లరు దానిసభ్యుడాయెను. ఆతడు చేరునప్పుడు పార్టీ రిజిస్టరులో ఆరుగురే సభ్యులు. హిట్లరు యేడవవాడు. పార్టీ మూలధనం యేడుపౌండ్లుమాత్రమే. ఆ కొద్ది ధనములోనే పార్టీప్రచారం చేయవలసి వుంది. దాని నిమిత్తమై హిట్లరు నాయకుడుగా నియమింపబడెను.

పార్టీప్రచారవిషయంలో ఆతడు జర్మనీలో కనివిని ఎరుంగని నూత్నపంథా త్రొక్కెను. ఏమంటే జర్మనీలో ఏదైనా ప్రజలకు తెలియజేయవలెనన్న పత్రికాభిముఖంగానూ, కరపత్రములద్వారానూ, పుస్తకముల మూలకంగానూ వ్యాపనజేసేవారు. ఎట్టివిద్యాధికులైనా, రాజకీయవేత్తలైనా, శాస్త్రవేత్తలైనా కాగితంమీద కలంపెట్టి రంగం నడుపవలసిందేగాని ధాటీగా మాట్లాడి ప్రజాబాహుళ్యాన్ని ఆకర్షించే అలవాటులేదు. అందుచేతనే ఇంగ్లండుకంటె జర్మనీలో సంవత్సరానికి మూడురెట్లు క్రొత్తపుస్తకములు ప్రచురింపబడతాయి. హిట్లరు అలాంటిపద్ధతులను అవలంబించక తన వాక్చాతుర్యముచే ప్రజాసామాన్యమును ఆకర్షించగలిగెను. ఒక వ్యక్తి గొప్పవాడగుటకు స్వశక్తియేగాక ఇతర వస్తువులుకూడా కొన్ని తోడ్పడును. అప్పటిలో దేశమంతా విషమపరిస్థితులచేత ఆవరింపబడెను. ప్రజలకు దారితెన్నులుగానక విషాదావస్థయందు మునిగియుండిరి. పరిస్థితులన్నీ హిట్లరుకు ప్రోత్సాహకరములుగ నుండెను. మీదు మిక్కిలి హిట్లరు తన వాగ్గోళికలందు సభ్యులనాగింపజాలు మహావక్త. శరపరంపరలుగ నాతడు మాటలు విసరివేయగలడు. సౌరభంగాని, మాధుర్యముగాని, హాస్యరసముగాని అతని ఉపన్యాసమున ఉండవు. అవెడు కణకణలాడు అగ్నికణములనే క్రక్కును. ఆతని హృదయమునుండి యుప్పతిల్లునది కేవలం తీవ్రావేశము. చివరకు ఆ ఆవేశము ప్రజల్ని పిచ్చెక్కించి వదలివేయును.

హిట్లరు సభానిర్వహణకౌశల్యం శ్లాఘనీయమైనది. సభాప్రారంభమున ఆతడు కన్పించువాడుకాడు. ముందు తనమిత్రులచే

మాట్లాడింపజేసేవాడు. సభ జరుగు మధ్య సమయమున సభాపీఠమును అలంకరించెడివాడు. కొన్ని సభలయందు రంగస్థలమున ప్రక్క తెరలవలె ఏర్పాట్లుగావించి సరిగ్గా నిర్ణీతకాలమునకు ప్రక్క తెరలనుండి అట్టహాసంగా సభ కేతెంచెడివాడు. ఆతని సభలు కేవలం నాటకంతంతులో ఉండేవి. ఇదంతయూ చేయవలెననే చేసెడివాడట. ఎందుకంటే ప్రజలు యిలాంటివాటికి లొంగి జోహారుచేస్తారు కాబట్టి. ప్రజాసామాన్యంయొక్క మనస్సు పసిబిడ్డలమనస్సువంటిదనే గెథీమహాశయుని సూత్రంలో చాలనిజంవున్నదని హిట్లరు నమ్మిక. చిన్నపిల్లల్ని నమ్మించడం తేలిక. ప్రజాసామాన్యన్నికూడా అంతే. ఎప్పుడూ సభల్ని సాయంత్రం జరిపేవాడు. దీనిలో కూడా చిన్నచిదంబరరహస్యంవుంది. పగలంతా పనిచేసిచేసి సాయంత్రానికి అలసటచే మానవులు కొంచెం మందమతులుగా వుంటారు. విచక్షణాజ్ఞానం తక్కువై పోతుంది. అప్పుడేమిచెప్పినా వూరకేతలలూపడమేగాని తమ సూక్ష్మబుద్ధిని ఉపయోగింపనోల్లరు. ప్రజాబాహుళ్యంయొక్క తత్వంగ్రహించి హిట్లరు దానికి అనుగుణ్యంగా వ్యవహరించేవాడు. విషాదావస్థయందు మునిగియున్న జర్మన్ ప్రజలకు ఆతని ప్రబోధనలు వుత్సాహజనకంగా వుండేవి. తన అసమానవాగ్ధోరణిచే ప్రజాసామాన్యమును మాంత్రికబలముతో వలె వశవర్తులనుగా జేసివైచెను.

జర్మన్ లేబరుపార్టీవారి యాజమాన్యమున ఆగష్టు 1921-వ సంవత్సరములో క్రౌన్‌సర్కసు ఆవరణయందు హిట్లరు పెద్దసభను గావించెను. శబ్దవిపులీకరణయంత్రములు సహితం యేర్పాటు చేయబడెను. వేనకువేలుజనం సభకు హాజరయిరి. ఆనాడు హిట్లరు రెండుగంటలకుపైగా వుపన్యసించెను. జర్మన్ లేబరుపార్టీ పేరుమార్చి 'ది నేషనల్ సోషలిస్టు జర్మన్ లేబరుపార్టీ'యని పేరు పెట్టెను. నూతనధ్వజారోహణ గావించెను. ఎఱ్ఱని ధ్వజం; దానిమధ్యమున గుండ్రాకారమైన తెలుపు; తెలుపుమధ్య స్వస్థిక. ఎఱుపు-సోషలిజమ్, తెలుపు-జాతీయత, స్వస్థిక-ఆర్యవంశాభ్యుదయమునకు పాటుపడుట తెలియజేయునని నూతనధ్వజముయొక్క అంతరార్థమును సుబోధముగావించెను. దేశభావిభాగ్యోన్నతికిని, స్వజాతీయతాభివృద్ధికిని పాటుపడెదనని కంకణము కట్టుకొనెను, మహాసంగ్రామము పూర్వంవలెనే ప్రజలయందు క్షాత్రోన్మాదమును ప్రజ్వలింపజేసెను. హిట్లరు తన సహచరుడైన ఫీడర్ గాట్‌ఫ్రీడ్‌యొక్క సహాయముతో పార్టీప్రణాళికను తయారుజేసి 1922 లో ప్రమరించెను. దీని ననుసరించే హిట్లరు ఛాన్సెల్లరయిన పిదప రాజ్యాంగవిధానములందు మార్పులు గావించెను.

1871 లో ఫ్రాంకో-ప్రష్యన్ యుద్ధానంతరం జర్మన్ సామ్రాజ్యం వేఱువేఱు స్వయంపరిపాలనాయుతమైన స్టేట్లతో ఏర్పడియుండెను. చక్రవర్తి ప్రష్యాదేశపురాజు. ఈ ప్రభుత్వము ది సెకండు ఎంపైరని పిలువబడెను. ఐరోపా మహాసంగ్రామానంతరం 1918లో అది కూలిపోవుటచే హిట్లరు జర్మన్ సామ్రాజ్య పునర్నిర్మాణమునకు గడంగెను. డాక్టర్ గస్టల్ వాన్ కాక్ బవేరియా ప్రధానామాత్యుడు. బవేరియాని జర్మన్ సామ్రాజ్యముతో సంబంధం లేకుండా ప్రత్యేకరాజ్యంగా ఏర్పాటుచేద్దామని ఆతనివుద్దేశ్యం. హిట్లరు కిది గిట్టలేదు--తాను తలపెట్టిన సామ్రాజ్యస్థాపనకు, జాతీయోద్యమమునకు భంగకరమని బవేరియా రాజ్యవిభజనావశ్యకతనుగురించి ఉద్బోధనజే

యుటకై 1923, నవంబరు 8-వ తేదీన డాక్టర్ వాన్ కర్ అధ్యక్షతక్రింద మ్యూనిచ్ లో పెద్ద సభ జరిగింది. అధ్యక్షుడు వుపన్యసించుటకు లేచెను. తుపాకులు ప్రేలెను. అనుచరులతో ఆయుధసహితంగా హిట్లరు ఆతనిని సమీపించెను. వాన్ కార్ స్థంభీభూతుడాయెను. ప్రేక్షకులు భయకంపితులైరి. సభాధ్యక్షుని తన యుద్యమప్రణాళికమీద సంతకము చేయుమని హిట్లరు ఆజ్ఞాపించెను. వాన్ కర్ దానిని చదివి హిట్లరుతో చర్చించి, సంతృప్తిజెంది ప్రణాళికమీద సంతకమును చేసెను. కాని కొందరు రాజకీయోద్యోగులు దానికి సమ్మతింపరైరి. హిట్లరు లూడెన్ డ్రాఫ్ అనే సేనాధిపతితో కలసి బెర్లిన్ నగరమును ముట్టడించి అచటి కేంద్రప్రభుత్వమును ఆక్రమించుకొనవలెనని ప్రయత్నములు గావించెను. కాని ఫలించలేదు. వీరు తమ అనుచరులతో మ్యూనిచ్ నగరమునుండి 'ఓడియన్ ప్లేజ్' వద్దకు వచ్చుసరికి విరోధవర్గంవారు వీరిని ముట్టడించిరి. ఆపోరాటంలో హిట్లరు అనుచరులు పదిహేడుగురు చనిపోయిరి, హిట్లరు క్షతగాత్రుడై క్రిందపడెను. అప్పుడు అతని కాలర్ బోన్ (జత్రుబొలిక) విరిగెను. కొంచెం స్వస్థత చేకూరినపిదప విరోధవర్గంవారు హిట్లరు మీద రాజకీయ నేరముమోపి అయిదేండ్లు కఠినకారాగారశిక్షను విధించిరి.

1924, ఏప్రిల్, 1-వ తారీకున హిట్లరు కారాగృహశిక్ష ననుభవించుటకు లాండ్స్ బర్గుదుర్గమున ప్రవేశించెను. అందు కాలం వృథాపుచ్చక ఆత్మచరిత్రను వ్రాసుకొనెను. ఎనిమిదిమాసములు గడచినవి. చర్చిఅధికారులసహాయంవలన హిట్లరు విడుదలచేయబడెను. హిట్లరు చర్చిఅధికారులసహాయం అపేక్షించలేదు. కాని వారెందుకు సహాయముచేశారంటే, వియన్నాలోవుండే రోజులలో హిట్లరు క్రిస్టియన్ సోషలిస్టుపార్టీ అభిమాని. ఆ అభిమానంచేత క్రైస్తవమతాధికారులు ఆతని విడుదలకు ప్రయత్నించిరి. విడుదలైన పిదప మరల దేశమంతయు తిరిగి తన ఉద్యమమును వ్యాపింపచేయసాగెను. తన నాయకత్వములేని సమయమున నేషనల్ సోషలిస్టుపార్టీ చిందరవందరగా చీలికలైపోవుటచే మరల పార్టీని లేవదీసి 'నాజీపార్టీ' అని నామకరణము గావించెను. ఈసారి రాజ్యాంగవిధానములను త్రొక్కక సక్రమాందోళన సలిపి నెగ్గవలెనని పట్టుపట్టెను.

జర్మన్ పౌరులే 'రీచ్ స్టాగ్' (జర్మన్ పార్లమెంటు) ఆక్రమించుటకు అర్హులు. 1932 లో హిట్లరుకు జర్మనిపౌరసత్వపు హక్కులు లభించెను. ఆసంవత్సరం జరిగిన రీచ్ స్టాగ్ ఎన్నికలలో శాసనసభ్యునిపదవికి గెలుపొంది అధ్యక్షపదవికి హిండెన్ బర్గుతో పోటీచేసి వోడించబడెను. అంతటితో అధైర్యము చెందక ద్విగుణీకృతోత్సాహముతో తనపక్షమును బలపరచుటకు పాటుపడెను. 1933 జనవరిమాసమందు జరిగిన ఎన్నికలలో హిట్లరు పక్షాన్ని విజయలక్ష్మి ఆదరించింది. హిట్లరు ఛాన్ సెల్లరుగా నియమింపబడెను. 1933 మార్చి 23-వ తేదీన 'రీచ్ స్టాగ్'నందు ఛాన్ సెల్లరగు హిట్లరుకు నాలుగుసంవత్సరముల వరకు నిరంకుశాధికారం ప్రసాదించుటకై ఒకబిల్లు ప్రతిపాదింపబడింది. దానికి 441 మంది అనుకూలురు, 94 మంది వ్యతిరేకులు. హిట్లరుకు నిరంకుశాధికారం ఇవ్వబడింది. రాజ్యాంగతంత్రాన్ని తారుమారు చేయవచ్చు. సక్రమంగా వుపయోగించినా అక్రమంగా వుపయోగించినా సహకారం చూపవలసినదేగాని రీచ్ స్టగ్ లో నోరెత్తడానికి

వీలులేను. దేశపరిపాలనాసంబంధమైన హక్కులన్నీ అతని చేతిలో ఉంచబడినవి. బిస్మార్కు మహాశయుడు సహితం కలనైన గాంచని హక్కుల్ని హిట్లరు సంపాదించ గలిగెను. 1918 లో హోహీన్ జోలిరాన్ సామ్రాజ్యపతనానంతరం జర్మనీయందు ప్రజాపక్షప్రభుత్వం ఏర్పడింది. హిట్లరు ఛాన్సెల్లరయిన తర్వాత చేసిన రాజ్యాంగవిధానములందలి మార్పులతో జర్మన్ ప్రజాపక్షప్రభుత్వం అంతరించింది.

పూర్వపరిపాలన విధ్వంసమొనరించిన మాత్రముననే తనకార్యభారం ముగిసిందని హిట్లరు చంకలు కొట్టుకోలేదు. దానిస్థానే 'ది థర్డ్ ఎంపైరు' అని బలవత్తరమైన పునః ప్రభుత్వప్రతిష్ఠాపన గావించెను. దేశమునం గల వివిధపక్షములను స్టేటు ప్రభుత్వమునందు కలియుటకు ఆహ్వానించెను. తన నాజీపక్షాన్ని సహితం స్టేటులో కలిపి ప్రతిఘటనలేని నాజీ ప్రభుత్వమును స్థాపించెను. ఆస్వాల్డుమోస్లే-బ్రిటిషు రాజకీయవేత్త - యొక్క సంకల్పము వలె స్వాభిమానం, స్వజాతీయాభిమానం, సామ్రాజ్యాభిమానం, శ్వేతజాతీయాభిమానం మొదలగు భిన్నాచరణలయందు జర్మనీ ముందంజవేయవలెనని హిట్లరు సంకల్పం. జాతీయజీవితాన్ని నూతనపథంలో నడిపించి, జాతీయప్రతిభను, గౌరవాన్ని అధికంచేయడమే అతని ప్రధానాశయం. ఆధునికజర్మనీలో ఆర్యేతరజాతులకు పుట్టగతులు లేకుండాపున్నవి. దేశభక్తి అనేపేరుతో జాత్యాహంకారమును పెంపొందించెను. రాజకీయరంగములో నవ్యసంస్కారములు దలపెట్టెను. కొంత జాతీయతను కొంత సామ్యవాదమును ఆరాధించు క్రొత్తపద్ధతిని త్రొక్కెను. ఒకవంక నిరంకుశాధికారమును గౌరవించుచూ మరియొకవైపు ప్రజాపరిపాలనను సమర్థించుచుండెను. నష్టపరిహారవిధానమన్న హిట్లరుకు మంట. అందుచే వర్సెల్సు, సెంట్ జర్మన్ ఒడంబడికలు రద్దుపరచెను. స్వదేశరక్షణార్థం మారణసామగ్రిని వృద్ధిజేయుటకు నిశ్చయించెను. ఆర్థికవ్యవహారములు యితర జాతికి చెందినవారిచేతులలో ఇమిడివుండటం ఎప్పటికైనా ముప్పు అని యూదుల్ని దేశాంతరములు పట్టించెను. కులకక్షలు రూపుమాపబడి ఐకమత్యము దానిస్థానే ప్రవేశపెట్టబడింది. హిట్లరు మధ్యతరగతిలోనివాడగుటచే వారికి తగు అభిమానం చూపబడింది. వారికి వృత్తిసంఘములు ఏర్పాటుచేయబడి దేశీయశాసనసభలో ప్రాతినిధ్యం యివ్వబడెను. దానిచే ప్రతివృత్తిసంఘానికి అధికారులైన పెట్టుబడిదార్లకేగాక పాటకజనులకు కూడా ప్రతినిధులు ఏర్పడిరి. పనిజేయకుండా డబ్బును సంపాదించే పెట్టుబడిదారుల మార్గములను అరికట్టెను. వ్యక్తిస్వాతంత్ర్యధర్మమును సిద్ధాంతమునందు అంగీకరించిననూ సమాజసౌఖ్యమునకు భంగకరముగ నుండరాదనెను. దేశశాంతికి భంగకరమైన ప్రతికక్షీయులను రూపుమాపెదననెను. వార్తాపత్రికలను వశపరచుకొనెను. దేశంలోని విద్యావిహీనతను పారద్రోలెను. విద్యాక్రమమును మార్చివేసెను. నిరుద్యోగసమస్యను తొలగించెను. స్త్రీలను రాజకీయరంగమునకు రానివ్వక గృహస్థధర్మములను నిపుణంగా నిర్వర్తించునటుల గావించెను. కళ, సంగీతసాహిత్యములు, వ్యాయామప్రయాణాది వసతులు ప్రజాసామాన్యమునకు సులభముగా అందుపాటులో నుండునట్లు ఏర్పాటులు చేయబడెను. జర్మనీ ఆర్థికపరిస్థితులు పూర్తిగా చక్కపడక పోయిననూ జర్మనీదేశీ

యులు వానిని ఎంత క్లిష్టముగనున్న అంత సాహసోత్సాహముతో నెదుర్కొను ధైర్యమును, స్వశక్తియందు విశ్వాసమును, సుగుణోపేతమగు దేశభక్తిని హిట్లరు జర్మన్ ప్రజలందు కల్పించెను.

మహాపురుషులక్రియ లోకులకు కొన్నపుడు పిచ్చిపనులవలెనున్నను, కాలంగడచినచో ఆ క్రియల నిజరూపంబైటపడును. జర్మనీనుండి యూదుల్ని బహిష్కరించినపుడు ప్రపంచమంతా హిట్లరుచర్యలను తీవ్రంగా ఖండించెను. హిట్లరు అన్యాయంగా అక్రమమునకు దిగువాడుకాదు. యూదుల్ని వెళ్ళగొట్టడానికి ముఖ్యంగా మూడుకారణా లున్నవి. 1. జర్మన్ దేశీయుల కష్టసుఖములందు పాల్గొనక వారిని పాదాక్రాంతులను జేసికొని వారి రక్తమాంసములనుపీల్చి ఆస్తులను బెంచుకొని, హంసతూలికాతల్పములపై పరుండి జర్మన్ సామ్రాజ్యమునకు దామె కర్తలమనుకొను పుట్టుభోగులగుయూదుల అవినీతిగాంచి హిట్లరు సహించలేకపోయెను.2.యూదునకు జర్మనీజాతి స్త్రీ భార్యయైనచో వారిసంతానం యూదుల వర్గమునకుచెందునేగాని జర్మనీజాతికి చెందుట లేదు. ఇది జర్మనీకి ఏవిధంగా లాభంలేదు సరిగదా యూదులసంఖ్య ఎక్కువైపోతున్నది. ఇతర దేశజాతులలో అట్లుగాదు. ఇటలీయూదుడు యిటలీవాడగును. ఇంగ్లండు, ఫ్రాన్సు యిత్యాది దేశములలోకూడ అంతే. ఇతర దేశములలో లేనిఆచారం తన దేశంలోవుంది కాబట్టి, అది తన దేశానికి జాతికి అనర్థకం కాబట్టి దానిని నిర్మూలించుటకు నిర్ణయించెను. 3. యూదులజాతి జర్మన్ జాతికాదు. యూదులు ఆర్యేతరులు. ఆర్యవంశాభ్యుదయమునకు పాటుపడుచున్న హిట్లరు తన దేశములో తనవారిని పాతాళమున బడద్రోసిన ఆర్యేతరుల అభివృద్ధిని ఎట్లు సహింపగలడు? అట్టి యూదుల్ని దేశమునుండి బహిష్కరించినగాని తన దేశము బాగుపడదని హిట్లరు నమ్మి వారిని బహిష్కరించెను. ఆతడు ఇతరుల ఆగ్రహానుగ్రహములను పాటించువాడుకాడు. కార్యసాఫల్యమే అతని పరమావధి. పట్టుపట్టిన భల్లూకపుపట్టు. పరిస్థితు లెంత నిరుత్సాహకరముగ నున్నను ఆతనికి ఆపంతయు దిగులుండదు. ప్రపంచమంతయు తీవ్రముగ ప్రతిఘటించినను వెఱువక హిట్లరు యూదుల్ని బహిష్కరించగలిగెను.

హిట్లరు బ్రహ్మచారి. శాఖాహారి. తిండిబోతుకాడు. అతిస్వల్పముగ సాత్వికాహారమునే భుజించును. సాధారణముగ ఫలరసములతో పొట్టనింపుకొనును. మద్యపానవైరి. పొగత్రాగడు నిత్యం శరీరసాధకమును జేయును. ఉక్కుశరీరం, సింహస్వరూపం, గంభీర విగ్రహం, భోగలాలసుడుకాడు. నిరాడంబర జీవి, ప్రజాసామాన్యమును ఆకర్షించుటకు డాంబికపద్ధతుల ననుసరించునేగాని ఆతని దుస్తులు వీలైనంతవరకు నిరాడంబరముగ నుండును. నిగర్వి, స్వార్థత్యాగి, దీనబంధువు. ప్రజాహితైక కార్యములందు హిట్లరుకు వ్యక్తులతో మొగమాటంలేదు. ఉత్తరకుమార ప్రజ్ఞలు కొట్టనేరడు. కార్యవాది, గొప్ప రాజకీయతంత్రజ్ఞుడు, యుక్తిపరుడు, కీలుఎరిగి వాతపెట్టగల సమర్థుడు. ఎప్పటికేది ప్రస్తుతమో అది చేయును. హిట్లరు గొప్పమేధావి కాకపోయినా దేశమునంగల మేధావంతులను సమర్థులను ఎంచుకొని తన కనుసన్నలలో మెలగునట్లు చేయగలడు. తీరికసమయమున ఆతడు గ్రంథపఠనమును గావించును. దేశచరిత్రలు వేదాంతగ్రంథములుఅన్న ప్రీతి. మిత్రులసంఖ్య స్వల్పం. స్వల్పసంఖ్యాకులై

నను నమ్మదగినవారినే మిత్రులుగా గ్రహించును. హిట్లరువంటి ఉపద్రవకరుడు లేడనియు, రక్తపిపాసగల వేటకుక్క వంటివాడనియు కొందరి అభిప్రాయం. అది వట్టిఅపోహ. వీరుడగుటచే యుద్ధమన్న వెనుకంజవేయక పోవచ్చు, శిరమువంచు టెరుఁగని పౌరుషం వుండవచ్చు- అంతమాత్రమున సంగ్రామప్రియుడా? ఇతర దేశములతోపాటు స్వదేశరక్షణార్థము మారణసామగ్రిని వృద్ధిపరచుకొనుట అన్యాయమా? రాజ్యపాలనాభారమును నిర్వహించుటకు పూనుకొనినవాడు నిర్లక్ష్యముగ నుండజాలడని తెలుసుకొనవలెను. జర్మన్ ప్రపంచం శాంతివాతావరణకోసం తాపత్రయ పడిపోతున్నదని హిట్లరుకు తెలుసు. గతప్రపంచయుద్ధ సమయమున యేర్పడిన రక్తపుఛాయలు యింకనూ అంతరించలేదని తెలుసు. ఒకవిధముగా హిట్లరు శాంతిదూత. ఏనాడోవున్న అహంకారం, అదరిపాటు నేడు అదృశ్యములాయెను. ధీరశాంతుడు. దేశభక్తి, జాతిసేవ ఆతని లక్ష్యములు. దేశారాధనమే ప్రధానం. హిట్లరు విజయమునకు అచంచలమైన ఆత్మవిశ్వాసమే కారణం. నేడు హిట్లరుఅభ్యుదయమునుగాంచి ప్రపంచమంతయు అచ్చెరువొందుచున్నది.

---

## నాగపతులు మాకు ప్రసన్నులగుదురుగాక!

[నాగులచవితినాడు పాముపుట్టలలో పాలుపోయువారికి పాములవలని భయము ఉండనేరదు. మఱియు శేషుడు, వాసుకి, తక్షకుడు మొదలగు సర్పస్వాములు ప్రాణికోటికి అభయమిచ్చువారు. కావున వారిని ప్రార్థింతము.]

చ. బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చిదు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

చ. అరిదితపోవిభూతి నమరారులబాధలు వొందకుండఁగా
నురగుల నెల్లఁగాచిన మహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

ఉ. దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్ విపులప్రతాపసం
భావితశక్తిశౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర
త్పావకతాపితాఖిలవిపక్షులునైన మహానుభావులై
రావతకోటి ఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్.

ఉ. గోత్రమహామహీధరనికుంజములన్ విపినంబులన్ గురు
క్షేత్రమునం బ్రకామగతి ఖేలననొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బలదర్పపరాక్రమ దక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

—నన్నయమహాకవి.

# ముత్యాల్ని కూడా జొన్నల్లాగే పండించవచ్చు

రచయిత:

నమ్మి జగన్నాథము

[నీటిబిందువు ముత్యపుచిప్పల్లోపడి ముత్యంఅవుతుందా ? సముద్రంలో చచ్చిన మనుష్యులకళ్లు ముత్యాలుగా మారుతాయా ? ముత్యపుచిప్పలకు కలిగే కొన్ని రోగ లక్షణాలవల్ల ముత్యాలు ఉత్పత్తి అవుతాయి. ముత్యపుచిప్పల్లోపెట్టి మనం కోరిన వస్తువులకు ఆపురుగులవల్ల ముత్యపుద్రవాన్ని కళాయిమాదిరిగా పూయించుకోవచ్చు.]

అనంతకాలంనుంచీ విత్తానికీ, విభవానికీ మన దేశంలో ముత్యములు ఒకనిదర్శనంగా వుంటూవున్నవి. కాని వాని పుట్టుపూర్వోత్తరాలు చాలామందికి తెలియవు. ముత్యముల పుట్టుకనుగూర్చి ప్రజల్లో వున్న నమ్మకాలు విచిత్రమైనవిగా ఉన్నాయి. విచిత్రమైన ఈ నమ్మకాల్లో నాలుగు ముఖ్యమైనవై ఉన్నాయి. వానిని ఇచట పేర్కొంటాను.

(1) స్వాతికార్తికి చెందిన వాననీటిబిందువు ముత్యపుచిప్పల్లోపడి ముత్యం అవుతుందని. ఈనమ్మిక చాలా ప్రాచీనకాలంనుంచీ సర్వసమ్మతిమైఉంది. ఈ నమ్మికకు ఉపబలంగా 'నీరమె శుక్తిలోఁబడి మణిత్వముఁగాంచు సముంచితప్రభం' అనే కవివచనం, 'స్వాతి వానలకు ముత్యపుచిప్పలుకాచుకొని ఉన్నట్లు' అనే సామెత వున్నాయి.

(2) తుషారబిందువులు ఘనీభవించి, నోరుతెరచుకొని సముద్రమందు తేలియుండు గుల్లలలోబడి ముత్యముగా మారునని. ఈరీతిగా మన హిందువులేకాక రోమనులుకూడా నమ్మియుండిరి.

(3) తెరచియుండు గుల్లలలో వర్షకాలమున మెరపుల స్పర్శవలన ముత్యములు సృష్టింపబడునని.

(4) సముద్రమున పడిచచ్చిన మనుష్యుల కండ్లనే కొన్ని జలచరములు ముత్యములుగా మార్చునని. ఈ నమ్మికను ఆంగ్లనాటకపితామహుడు షేక్సుపియరు తన రచనములందు పేర్కొన్నాడు.

ఇంకను ఇట్టి నమ్మకాలెన్నోవున్నాయి. ఇప్పటి శాస్త్రజ్ఞులీవిద్దూరపు నమ్మకములను త్రోసిపుచ్చి శాస్త్రసమ్మతములగు కొన్ని వాదములను చేయుచున్నారు.

ముత్యపుచిప్పలు ఆలచిప్పలవంటి ఒకజాతి గవ్వలు. ఈ గవ్వలను ఇంగ్లీషున "పెరల్ ఆయిస్టరు" లందురు. ఈ గవ్వల శరీరావయవములలో కొన్ని రోగలక్షణములవలన నీముత్యము లుత్పత్తియగును. "తండ్రి గరగర—తల్లి పీచుపీచు—బిడ్డలు రత్నమాణిక్యాలు"—అని పనసపండునన్నట్లు, ముత్యములవిషయంలో తండ్రి అసహ్యమగు ఆలచిప్ప—తల్లి కంపు మాంసము—బిడ్డలు అత్యంతరమ్యమగు ఆణిముత్యములు, అని అనవచ్చు. "జన్మఖండాలుడయ్యును కర్మబ్రాహ్మణుడు కాగల"డని భగవద్గీతలో నుడివినట్లు జన్మచే నీచవస్తువులయ్యును యీవిశాలప్రపంచమునమిక్కిలి విలువగలిగి, యీ ముత్యములు ఉన్నతస్థితిని, ఉత్కృష్టగౌరవమును పొందుచున్నవి. ముత్యపుచిప్ప శరీరమున నిట్టి రోగావస్థకు మూలము ఒకవిధమగు పురుగుగాని లేక నొక సూక్ష్మమగు నిసుకరేణువుగాని లోన ప్రవేశించియుండుట. వీని ప్రవేశమువలన ఆయిస్టరుకు దురదపుట్టి ఆ పదార్థమును పైకి త్రోసివేయ ప్రయత్నించునుగాని కార్యసిద్ధికానిచో "కుదురని రోగము సహించికొని తీరవలయు"ను గాన దానిచుట్టును కొన్ని "సెల్సు"

పెంచి దానిపై నొకవిధమగు ద్రవపదార్థము "నేకర్" లేక 'మదర్ ఆఫ్ పెరల్'ను స్రవింపచేసి ఆ పదార్థమువలన దురదలేకుండ మృదుత్వము నేర్పరుచుకొనును. ఇటులనే చేరిన పరాయి పదార్థములకు దఫదఫా లీ 'నేకర్'ను పూసి పొరలుపొరలుగా ఘనీభవించనిచ్చి క్రమముగా పెంచును.

మరియొక విధముగా నిది సంభవించవచ్చును. ఆయిస్టరు గుడ్లుపెట్టునపుడు ఒక అండము యేదైనను ప్రాణములేనిది యుండి గర్భమునుండి బైటకుపోలేక, లోననేయుండి, నిస్సారమైనదయ్యు తల్లి శరీరమున రక్తనాళములవలన పోషింపబడి క్రమముగా పెరుగుచు తల్లిగర్భమున దురదను పుట్టించును. ఈ గ్రుడ్డుకు కూడ అది పైచెప్పినరీతిని నేకరును పూసి ముత్యమును జేయును.

ఇటుల, నేదియోయొక కారణమువలన పెరిగిన పుండయే మన మహామూల్యముగా భావించు, సృష్టిలో లభించు వస్తువులన్నిటిలో ముద్దులొలుకు ప్రశస్తమణి. పరిశోధనశాలలయందు మానవుడు రసాయనశాస్త్రసహాయమున వజ్రమును సయితము తయారు చేయుచున్నాము గాని నిజమగు ముత్యమును మాత్రమే నాటికిని సృష్టింప వానివలన గాదు.

ముత్యములు వేరువేరు ఉరవ, వేరువేరు ఆకారములు, వేరువేరు రంగులు కలిగియుండును. ముత్యములు పెక్కులు తెలుపురంగువే అయినను నలుపు, ఎరుపు, ఆకుపచ్చ, ఊదారంగులలోకూడా వుండును. గాజువలె నొకప్రక్కనుండి మరియొకప్రక్కకు వెలుతురును పోనిచ్చు స్వభావముగలవియు సుద్దవలె మందముగానుండు ముత్యములును గలవు. పెక్కుపొరలుగలిగి యుండుటచేతను ఒక్కొక్క పొరనుండి వెలుతురు ప్రతిఫలించుచుండుటచేతను ముత్యములు విమలకము (Opal) రాళ్ళవలె పంచరంగులు గలిగి యున్నట్లగపడును. ముత్యమును అడ్డముగా మధ్యకు కోసి, చూచినచో పొరలు గలిగి వుల్లిపాయవలె నుండును.

చరిత్రారంభమునుండియు సముద్రములలో ముత్యములున్నట్లు మనవారికి తెలియును. ఇప్పుడు మనము గుల్లలు, గవ్వలు సముద్రతీరమున వినోదార్థము ఏరుకొనునట్లు, పూర్వకాలమున సముద్రప్రాంతజను లీముత్యములను వేడుకకొరకు జాగ్రతపరచుచుండెడివారు. ఈ ఆటవస్తువులే నేటి కమూల్యములై, రాజాధిరాజులయు, మహారాణులయు ఆభరణములను, కిరీటములను నలంకరించునవయ్యెను.

మనకంటెను పూర్వమునుండి ముత్యములవిలువ చీనావారికెరుక. కొన్ని చీనాముత్యములు మంచినీటి గవ్వలనుండికూడా గ్రహించుచుండిరి. రానురాను ఇండియా, చీనా సింహళదేశములలో మహారాజులకు వారి సామంతరాజులు ముత్యములే కట్నములుగాను, కానుకలుగాను, కప్పములుగాను చెల్లించుట ఏర్పడెను. పరిష్యా ఈజిప్టు దేశీయులకుకూడా పూర్వమునుండి ముత్యములనుగూర్చి తెలియునుగాని ఈజిప్షనులు వీటివిలువను కొంతకాలమువరకు పాటించరైరి. గ్రీకులకు, రోమనులకుకూడా ముత్యములు తెలిసియుండెను. రోమను లీయాభరణములను వుత్తమజాతివ్యక్తులుతప్ప ఇతరులు ధరింప వీలులేదని కొన్నిపద్ధతుల నియమించిరి. బ్రిటిషు దీవుల ప్రాంతమున పూర్వము ముత్యములు దొరకుచుండెడివట. అందువలననే రోమనుచక్రవర్తి జూలియస్ సీజరు బ్రిటనుపై దండెత్తెనని చెప్పెదరు.

ఆభరణములలో నుంచుటయేకాక, ముత్యములకు [illegible]డు క్రొత్త వుపయోగములనుకూడ కనుగొనెను. వానిలో ముఖ్యమైనది ముత్యములను ఔషధముల కుపయోగించుట. ముత్యపుచిప్పలతో బొత్తాములు, గుండీలు మున్నగునవి చేయుటకూడ ఇక్కడ పేర్కొనవచ్చును.

'పెరల్ ఆయిస్టరు'లలో మగవి, ఆడవి వేరుగానుండును. ఋతుకాలమున (స్వాతికార్తియే అయియుండవచ్చు) తమ లైంగికధర్మము ననుసరించి శుక్లశోణితములను సముద్రముననే స్వేచ్ఛగా విడివిడిగా తమ యిచ్చవచ్చినట్లుగా విడచును. ఈ విడవబడిన శుక్లశోణితములు దైవాధీనముగా నీటియందే కలసి

గ్రుడ్డు పరిపక్వమగును. ఎక్కువగా గ్రుడ్లు అపరిపక్వముగనే నాశనముకాకుండ సృష్టికర్త మగగవ్వల స్వభావమునే తగినట్లొనర్చెను. ఋతుకాలమున తమ స్త్రీలను గాంచినప్పుడే యీమగపురుగులు తమ రేతస్సును జలమునందు విసర్జించును. తత్క్షణమే స్త్రీలు కూడా తమగ్రుడ్లను పెట్టును. అట్లు శుక్లశోణితములేక కాలమందు వెలువడుటంజేసి గ్రుడ్లన్నియు పిల్లలగుటకు వీలగును. మొదట గ్రుడ్లు వంకరలు గలిగియుండినను పక్వమునకురాగా గుండ్రమగును. ఈ గ్రుడ్లు మహాసముద్రమున పలుప్రవాహముల దరాదాక్షిణ్యములకు లోనైయుండి నతిశీఘ్రకాలమున వృద్ధిబొంది, పిల్లలయి, చిన్నవెండ్రుకల పోలిక నుండు 'సిలియా'ను గలిగి నీటియందు నీదుచుండును. కాని తమమార్గమున తాముబోగల శక్తిలేమిచే ఇవి తమ జన్మాంతమువరకు నీటిప్రవాహములకు గురియగుచునే యుండును.

పుట్టిన మరుచటినాటినుండియు వీని శరీరములపై చిన్న చిప్పలు మొలచుట కారంభించును. కాని ఇంకను ఇవి తేలియేయుండును.

ఈ యవస్థలో దీనిని 'లార్వల్ ఆయిస్టరు' అందురు. ఈ సందర్భమున సాధారణముగా ప్రవాహములీపిల్లలను తమ తలిదండ్రులనుండి అత్యంతదూరమునకు త్రోసివేయును. అట్టిచో, స్వభావసిద్ధముగా పెరుగు మొక్కలకుగాని, రాళ్ళకుగాని, మరేదైన స్థిరముగుదానికిగాని అత్తియుండుటకు వీలయిననేగాని లేనిచో(అనగా వట్టి యిసుక నేలను జేరినచో) ఈపిల్లలకు తగునెలవులేక అకాలమరణమునొందును. ఈ గండముగడిచి, అత్తియుండుటకు వీలుకలిగినచో అదియే వానికి జీవాధారమగునని నమ్మవచ్చును. ఈ యవస్థను 'స్పేట్' అందురు. ఈ స్థితి పుట్టినవారం రోజులకుగాని కలుగదు.

ఈ పిల్లలు దూరముగా కొట్టుకొనిపోకుండగనే మానవకల్పితమగు 'ఆయిస్టరు ఫారము'లలో స్థిరముగనుండు పరిస్థితుల నేర్పరచెదరు. యీ స్థితియందు (మరి యీదుట యవసరములేదు గనుక) యీదుట కుపయోగపడు అవయవములు కృశించి చిప్పలు, వానిని తెరచి మూయుటకుగాను కండరములు, నరములు వృద్ధియగును. యీ అవయవములు వృద్ధినొందుచుండ శరీరము బరువెక్కి యివి నీటమునిగి అడుగునజేరును. తనజాతికిచెందిన మరికొన్ని గవ్వలరీతిని ఇదికూడ దేనికైన తన 'బైసస్'తో నంటుకొనుటయు, మరల దానిని విడచిపెట్టి నటునిటు స్వేచ్ఛగా తిరుగుటయుగలదు. వీనికి చీకటి వెలుగుల వ్యత్యాసము తెలియును. మొదటి రెండు సంవత్సరములు నీటియడుగునేయుండి అతిత్వరితముగా పెరుగును. నాలుగైదేండ్లకు రమారమి ఏ అంగుళములు ఎత్తు-2, 2½ అంగుళముల వెడల్పును పెరుగును. యీ స్థితిలో వీనిని పట్టవచ్చును. వీని క్షేమసమాచారమంతయు శీతోష్ణస్థితిమీదను, జలప్రవాహములమీదను, కొన్నిజాతుల చేపలమీదను, సముద్రమునయుండు మరికొన్ని జంతువులు మొదలగు శత్రువుల చర్యలమీదను ఆధారపడియుండును. మిక్కిలి లోతులేని ప్రదేశములు వీనికి అనుకూలము.

వీని శరీరావయవనిర్మాణసూత్రమునుబట్టి ముత్యములు తయారగును గనుక యీ యంశమును గూడ సూక్ష్మముగ తెలిసికొనుట మంచిది. యీ అవయవములలో చిప్ప, 'మాంటిల్' ముఖ్యము. మాంటిల్ చిప్పలోని పురుగుయొక్క శరీరభాగము. అందు 'క్రేడిల్' అను ఒకభాగమున 'పెరుల్ సేక్' అను తిత్తిలో ముత్యము ఉత్పత్తియగును.

పై రీతిని సహజముగ ముత్యములు సృష్టిలో పెరుగును. కాని మానవులుకూడ తమ యిష్టానుసారము ఆయిష్టర్లచే ముత్యములను తయారుజేయింపగలరు. మొదట 'లిన్న్యాస్' అను పరిశోధకుడున్నూ, యూరోపియనులలో ననేకదేశీయులును, చీనావారన్నూ ముత్యములను పండించిరి. ఇట్టి కృషియందు చీనావారగ్రగణ్యులు. వీరు ఆయిష్టరు మేంటిల్కును చిప్పకును మధ్యను ముత్యపుచిప్ప తునకలుగాని, చిన్నచిన్న విగ్రహములుగాని దూర్చి కొంతకాలము నీటనుంచెడివారు. యీ వస్తువులను ఆయి

ష్టరు 'నేకర్' అను ద్రవపదార్థమును పూయుటవలన కొసకు ముత్యములో ముత్యపు విగ్రహములో తయారగుచుండెడివి. చీనావారు తరచు బుద్ధవిగ్రహములను 'అయిష్టరు షెల్'లో నుంచి యీ విగ్రహములకు ముత్యపుపూతను పూయనిచ్చి, యీ చిన్నారి ముత్యపు బుద్ధదేవుళ్ళను అమ్ముచుండెడివారు. ఇట్లు ముత్యములను యిచ్చవచ్చినట్లు విరివిగా నుత్పత్తిచేయ గలిగియు, ముత్యములకు హెచ్చు విలువయుండియు, పూర్వము వ్యవహారమునకు తగు సదుపాయములు లేక చీనావా రీకృషిని దీక్షతో సల్పరైరి.

ఇపుడు జపానువారు—అందును ప్రముఖులగు కొకిచిమికి మాటోగారు—అచ్చమైన ముత్యములను అమితముగా నుత్పత్తిచేయుచున్నారు. యీ కృషియందు మికిమాటోగారికి గురువు టోకియో యింపీరియల్ యూనివర్సిటీలో జంతుశాస్త్రమున ప్రొఫెసరుగానున్న డాక్టర్ మిట్సికూరి. ఇట్లుత్పత్తియగు వానినే 'కల్చర్ పెరల్సు' అందురు. నిజముగ మికిమాటోగారు ఎట్టి కార్యక్రమము ననుసరించి యీ ముత్యముల నుత్పత్తిచేయుదురో దానిని నేటికిని వ్యాపారరహస్యముగనే కాపాడెదరు. ఏది ఎట్లున్నను వారి పరిశ్రమలో మాత్రము 700 మంది పనివాండ్రను నియోగించి పోషించుచున్నారు. ఏడాదికి 30,00,000 అయిష్టర్లను యీ పరిశ్రమలో నియోగింతురు. జపానుదేశపు సముద్రప్రాంతమునందంతటను 40,000 ఎకరములమేర, 5 నిలువులనుండి 15 నిలువుల లోతుగల నీటిప్రదేశములందు అయిస్టరు 'ఫారములు' లేక 'పార్కులు' పెక్కులు గలవు. వీనిని మనము ముత్యాలపంటపొలము లనవచ్చును. ఇందులో నియోగించిన అయిస్టర్లన్నియు బ్రతుకవు. బ్రతికినవన్నియు ముత్యముల నీయవు. అప్పటికిని ప్రపంచమునందంతటను మిక్కిలి చౌకధరకు అమ్ముటకు వీలగునన్ని ముత్యములను జపానువారే ఏటేట పండింతురన్న నతిశయోక్తి కాదు. మికిమాటోగారి మూలముననైనను పలువురు సామాన్యులకు సయితము ముత్యాలహారములను ధరించు అదృష్టము గలిగినది. యీ ముత్యాలపంటను చూడ చూడ నరునికి నారాయణుడుకూడ లోకువగ నున్నట్లున్నది.

అయిష్టర్లనైజము మికిమాటోగార్కి తెలిసినట్లు మతి యెవ్వరికిని తెలియదనిన నసత్యము కాదు. యీ అయిష్టర్లకు ముత్యముల నుత్పత్తిచేయు సూత్రమును తెలిసికొని నేర్పుటకు వీరికి 20 సంవత్సరములకు పైని పట్టెను. అదియును అమితవ్యయప్రయాసలతో, ఇరువదిసంవత్సరముల కాలము దీర్ఘమైనదిగ పైవారి కగపడినను శాస్త్రపరిశోధకులకు మాత్రము అది ఒకక్షణమువంటిది. ఇంక అయిష్టర్ల తత్వమే మన—ఏదైన లోహముతో చేసిన వస్తువుతో ముట్టిన జాలును—అది చచ్చి యూరుకొనును. ప్రాణముండినగదా ? వేరు ప్రయత్నములను సల్పుటకు. అట్లు చావకుండ సంబాళించుటయే యీ కృషియందు మొదటిమెట్టు. పిదప ముత్యపుచిప్పలలో చిన్న రంధ్రములొనర్చి వానిద్వారా పరాయిపదార్థములు లోనికి జొనిపిరి- ముత్యపుపూత పూయించుటకు. యీ పద్ధతియు ఫలించలేదు. తరువాత మాంటిలులను చిప్పలకు మధ్యను ముత్యపుచిప్పయొక్క రేణువులను జొరబెట్టి జూచిరి. అయిష్ట రొకనైన నీ పదార్థము నిముడ్చుకొనకుండెను. యీ పదార్థములను పలువిధములగు జిగురులచేతను, సిమెంటులచేతను నంటింపజూచిరి. అదియును సాగలేదు. ఇట్టి ప్రయత్నములలో నెన్నియో సంవత్సరములు గడచినపిదప, ఒక అయిష్టరు మాంటిలుతో నమర్చిన ఒక సంచియందు 'మదర్ ఆఫ్ పెరల్'యొక్క రేణువునుంచి, ఆసంచి మరియొక అయిష్టరుగర్భమున ప్రవేశబెట్టిచూడ, అట్టిదానిని అయిష్టరు సహించుకొనుట తెలియనయ్యెను. యీ కార్యము అతినిపుణులగు శస్త్రవైద్యులకుగూడ కష్టసాధ్యమైనది. ఇందు తరిఫీదయిన నిపుణులకు సయితమీ కార్యము కష్టమనిపించును. మిక్కిలి నేర్పరులుకూడా దినమున కరువదికంటె నెక్కువవాటియందు నీ సంచులను ఉంచలేరు. ఇట్లు చేయగా బ్రతికియున్న అయిష్టర్లను నూరింటిని

ఒక్కొక్క బోనుయందుంచి సముద్రమున బల్ల తెప్పలకు వ్రేలగట్టియుంతురు. సంవత్సరమునకు రెండుసార్లు బోనులను తనిఖీచేసి ఆయిష్టర్లను శుభ్రపరచి మరల నీటియందుంతురు. ఆరేడేండ్లకు మన మపేక్షించు ముత్యములు తయారగును.

నీటియందు మునిగి ఆయిష్టర్లను పట్టితెచ్చు పని యంతయు జపానులో స్త్రీలదే. తెల్లని యిజారులు పొట్టి జాకెట్లు తొడుగుకొని, తలముడివైచుకొని, కండ్లకు నీరు చొరనీయని సులోచనములధరించి, ఆయిష్టర్ల నెత్తుకొనివచ్చుటకు ప్రత్యేకముగా తయారుచేయబడిన గంపలతో నీటదిగి ముత్యపుచిప్పల నేరుకొని, నీటిపైకి తేలి పైన వేచియుండు పడవల చేరుకొందురు. వీరు సుళువుగా నీటిలో 2, 3 నిముషములుండగలరు. ఇందు నిపుణులు నిముషమునకు 10 నిలువుల లోతునుండి 50, 60 ఆయిష్టర్లను తేగలరు.

మికిమాటోగారి ముత్యములుకూడా ఆయిష్టర్ల మూలముననే నుత్పత్తియయినను నవి ఇండియా, పరిషియా ముత్యములంత విలువగలవికావు. దీనికి కారణము జపాను ఆయిష్టర్లు ఇండియా ఆయిష్టర్ల పాటి శ్రేష్టమగు జాతివి కాకుండుటయే. ఒకముత్యము మికిమాటోగారి పంట ముత్యమో (కల్చర్ పెరల్), లేక ప్రకృతిలో తనంతట తాను ఆయిష్టరు గర్భమునపుట్టినదో (నేచురల్ పెరల్), అటులైన ఏదేశమున పుట్టినది అను విషయములను శాస్త్రపరిశోధనాగృహములందు క్వార్ట్జు మెర్క్యురిలాంప్, రేడియోగ్రాఫ్ మొదలగువాని సహాయమున తెలిసికొననగును.

తక్కువలోతుగల నీటియందు నశించును గాన జపాను ఆయిష్టరును, ఆయిష్టరు పార్కులందు పెంచుట సులభము. ఇండియన్ ఆయిష్టరు లోతునీటియందు నివసించును గనుక ఆయిష్టరుపార్కులలో జీవించలేదని నిశ్చయింపబడినది. కాని ఇటీవల పరిశోధనలవలన ఇదియును జపాను ఆయిష్టరువలె పార్కులందు పెంచనగునను అంశము రూఢమగుచున్నట్లు తెలియుచున్నది. యీ పరిశోధనలు కొంతకాలమునుండి, రామేశ్వరమువద్దనున్న క్రూసెడై ద్వీపమందు మదరాసు గవర్నమెంటు మత్స్యశాఖవారు సల్పుచున్నారు. యీ పరిశోధనలు తగు ఫలితమొసగనేని మనముకూడా మికిమాటోతో పోటీజరుప సాధ్యమగును. అటుల నీ కార్యమును జయప్రదముగా సాగించిననాడు మనకొక పర్వదినముగదా! ఆ దినమున మనదేశవైభవమును వెలిబుచ్చ మనము మనపూర్వులవలెనే ముత్యాల ముగ్గులతో మన గృహములను అలంకరించుకొనుటకు అవకాశమేర్పడును.

---


## బర్మాఖండములో

‘ఆంధ్రభూమి’కి ఆయాస్థలములందు దిగువను పేర్కొనబడినవారు ఏజెంట్లుగనున్నారు. ఆంధ్రులు విరివిగగల బర్మాఖండములోని మిగిలినభాగములందు ‘ఆంధ్రభూమి’కి ఏజెంట్లు కావలసియున్నారు. కావున ఏజెంట్లుగ ఉండగోరువారు షరతులకై వ్రాయ ప్రార్థించుచున్నాము.

1. **రంగూన్** — శ్రీయుత ఎ. సత్యనారాయణరావు గారు; జనరల్ మర్చెంటు అండ్ కమీషన్ఏజెంటు-నెంబరు 141, మొగల్ స్ట్రీట్.
2. **మోల్మేన్** — శ్రీయుత బి. సుబ్రహ్మణ్యముగారు; నెంబరు 187, లోయర్ మెయిన్ రోడ్.
3. **హెంజడా** — శ్రీయుత ఆర్. సూర్యనారాయణగారు; నెంబరు 11, కోర్టు హౌస్ రోడ్.


---

# 'తల్లినగుట నాకు ఇష్టము లేదు'

రచయిత్రి:
శ్రీమతి వేదుల విశాలాక్షి

గొడ్రాలితనానికి మించిన దురదృష్టం, పూర్వజన్మంలో చేసిన మహాపాతకానికి అంత కుమించిన శిక్ష లేదని హృదయపూర్వకంగా నమ్మిఉండే భారతస్త్రీలోకంలో పుట్టిన నేను ఈవ్యాసం వ్రాసినందుకు నాసోదరీమణులందరు నామీద దుమ్మెత్తిపోస్తారని నాకు తెలుసు. అయినా నామనస్సులోవుండే అభిప్రాయాన్ని వెల్లడించకుండావుండడం అంతరాత్మకు ద్రోహంచెయ్యడమే అవుతుందని నమ్మి ఈవ్యాసం వ్రాశాను. అసలీవ్యాసం మారు పేరుతో ప్రచురిద్దామని నా ఉద్దేశం. కాని ఈ పత్రికా సంపాదకుల సలహాను అనుసరించి ఈవ్యాసం వ్రాసిన చొఅవతోనే దీన్ని నా పేరుతోనే ప్రచురించడానికి అనుమతించాను. ఇందలి నాఅభిప్రాయాలకు స్త్రీలోకం అంతా కక్షతోకూడిన వ్యతిరేకభావం వెల్లడిస్తారని నాకు తెలుసు. అయినా అట్టిభావాలు వెల్లడించడంతో వారు ఊరుకోక వానిని వ్యాసరూపంగా ఈ పత్రికలో ప్రచురించి నా అభిప్రాయాలు సత్యసమ్మతములుకాని సముచితములు కాని కావని రూపించగలిగితే నా అభిప్రాయాలు మార్చుకోవడానికి నాకేమీ అభ్యంతరంలేదు. అంతవరకూ నేనీవిషయంలో నిశ్చితాభిప్రాయంతోనే ఉంటానని మనవి. ఉపోద్ఘాతం అయింది కాబట్టి ఇక అసలు విషయంలో ప్రవేశిద్దాం.

ఆడది చెయ్యవలసినపనుల్లో కడుపుతోవుండడం వకటి. ఇది మిక్కిలి శ్రమకరంఅయిందీ, కష్టావహంఅయిందీ అని అందరూ అంగీకరిస్తారు. గర్భిణీహితచర్య మొదలైన గ్రంథాలుచదివితే చూలింతతనమనేది స్త్రీకి ఒకవిధమైన ఖైదు అనిపించకమానదు. పోనీ ఇది ఏమన్నా కొన్ని జంతువుల్లోవలె ఒకటి రెండు నెలల్లో తీరేదా? కనీసం తొమ్మిదినెలల దీర్ఘకాలం ఈఖైదుతప్పదు. తఱుచుగా పదినెలలు, ఒక్కొక్కప్పుడు పదకొండునెలలు, అరుదుగా రెండు తొమ్మిదినెలలూ మూడు తొమ్మిది నెలలూ స్త్రీలు ఈఖైదులో వుండడం కలదు. ఈఖయిదులో ఉన్నన్నిరోజులూ ఆడది వడ్డాణంమొదలైన ఆభరణాలు పెట్టుకోకూడదు, బట్టలు గుత్తంగా తొడుక్కోకూడదు, యాత్రలకు సినీమాలకు వెళ్ళకూడదు, బత్తాయిజున్ను మొదలయినవి తృప్తికలిగేలాగు తినకూడదు, బొప్పాయి మొదలైన పళ్లు వేలేసి ముట్టకూడదు. ఇంకాఎన్నో 'కూడదులు' వున్నాయి.

లెక్కపెట్టరానివిగావుండే ఈకూడదులకు సహించి వూరుకున్నా కడుపులో పిండంపడింది మొదలు ఎంత ఆరోగ్యవతుల ఆరోగ్యమన్నా చెడిపోకమానదు. తిన్నది ఇమడదు. ఇమిడేది తినడానికి వీల్లేదు. ఏరోగంవచ్చినా నీళ్ళాడితే కాని పోదంటారు. అసహ్యకరమైన మన్ను, కచ్చికా తినాలని బుద్ధి పెడత్రోవపడుతుంది. నిజస్థితి ఇల్లాంటిదిఅయినా స్త్రీలకు తెలియకుండావుండాలని వాళ్లు డొక్కున్నా అరోచకమైన డొకుపదాన్ని ఉపయోగించక దాన్ని ప్రత్యేకంగా వేవిళ్లుఅనే తియ్యనిపేరుతో పిలుస్తారు. ఈ తియ్యనిపేరుగల రోగానికి ఏదో రసాయనమని పుల్లటిమందుఇచ్చి ఆడవా

ళ్లని వైద్యులు మసిపూసి మారేడుకాయ చేస్తారు. గర్భధారణవ్యాపారంలోవుండే వొడుదుడుకుల్ని కాని, కష్టనష్టాల్ని కాని తెలియకుండా వైద్యులనే మోసగాళ్లు కాబోయే తల్లుల్ని అజ్ఞానంలో చెరలాడిస్తున్నారు. ఇల్లా మోసగింపబడడంకంటే స్త్రీలు గర్భధారణ వ్యాపారాన్ని విరమించుకోవడం మంచిది.

నెలలునిండినకొద్దీ పొట్ట పెరుగుతుంది, బరువెక్కుతుంది. కాలు కదిపితే అలసట. పూర్వపు అందం అంతాపోతుంది. ఏదోవికృతరూపం వస్తుంది. కళాదృష్టిగల కళ్ళకు దీనివల్ల కలిగేవికారం మనస్సునుదాటి బయటికిరాలేనంత సున్నితంగా వుంటుంది. ఏమైనా ఆస్థితి సుఖమయభావాల్ని కలిగించేదిగా వుండదని మాత్రం చెప్పకతీరదు. అందాన్ని చెడగొట్టేదిగాను, సుఖమయభావాల్ని కలిగించలేనిదిగాను వుండే మాలింతతనమనే వ్యాపారాన్ని స్త్రీలు ఏల అవలంబించాలి? ఏవిధంగా చూసినా నష్టమేకాని లాభంలేనివ్యాపారం మనంఎందుకు చేయాలి?

అనారోగ్యాన్ని, అనాకారాన్ని సహించి ఊరుకున్నా చివర్ని యాతనఎల్లాగా తప్పదు. కొందరు నీళ్ళాడ్డం చాలాకష్టమౌతుంది. డాక్టర్లు అపూర్వమైన ఆపరేషన్‌లుచేస్తేకాని పిండం బయటికిరాదు. బయటికివచ్చినా దాని బ్రతుకు, దాని తల్లిబ్రతుకు సంశయాస్పదమే అయివుంటుంది. మరియిక బిడ్డకుట్లసంగతి చెప్పనే అక్కరలేదు. కొందరు 12 గంటలు, కొందరు 24 గంటలు, కొందరు 48 గంటలు నొప్పులతో బాధపడతారు. ఏమాత్రం అవకాశంవున్నా ఈనొప్పులులేకుండా మాతృత్వం కావాలని కోరనిస్త్రీవుండదు. ఈగండంగడిచి పిండం బయటపడితే తిరిగి ఎప్పుడూ ఇల్లాంటి దానికి అవకాశం రానియ్యనని నీళ్ళాడే ప్రతిస్త్రీ అనుకుంటుంది. దీనినే ప్రసూతివైరాగ్యం అని వేదాంతులు ఆక్షేపిస్తారు. గర్భధారణ వ్యాపారంలో దిగి స్త్రీ ప్రసూతివేళాసముద్భూతసంకటానికిఓర్చి తనఒళ్లు గుల్లచేసుకుని వేదాంతుల అపహాస్యానికి గురికావడంకంటె అసలు ఆవ్యాపారంమానేస్తేమంచిదికాదూ?

బిడ్డకుట్లకు, వేదాంతుల వెక్కిరింపులకు మొండితనంగా సహించగలిగినా స్త్రీ ప్రసూతిదినాలని లెస్సగా వెళ్ళబ్రోసి బ్రతకగలగడం కష్టం. ఆడదానికి బిడ్డబిడ్డకూ గండమే. ఆమె ఆకాన్పుదాటి బ్రతకకలిగిందా తిరిగి తల్లికడుపున పుట్టివచ్చిందన్నమాటే. అది ఆమెకు పునర్జన్మ అన్నమాటే. ప్రపంచంలో ఏటేటా సంఘటించే ప్రసూతిమరణాల్ని చూస్తే ఏ ఒక్కరోగంకూడా ఇంతమంది స్త్రీల ప్రాణాల్ని తియ్యటంలేదని నిర్ధారణ అవుతుంది. మనిషికి క్షయరోగం వంటిరోగంవస్తే దాన్ని కుదర్చడమే కాకుండా ఆటంకపరచడం కూడా చేస్తాము. కాని ప్రసూతిరోగం విషయంలో చికిత్సే కాని నిరోధం అవలంబించడంలేదు. ఇది ఘోరమైన అన్యాయం. అనేకస్త్రీల ఆయుర్దాయాన్ని కబళించే రోగమైన ప్రసూతిరోగాన్ని నిరోధించడానికి ప్రశస్తమైన సాధనం స్త్రీలు గర్భధారణవ్యాపారం చెయ్యకుండా వుండడమే అవుతుంది. మహాభాగ్యమైన ఆరోగ్యాన్ని నిలుపుకోడానికిన్నీ, ప్రసూతిమరణదేవతయొక్క కరాళవదనాన్నుండి తప్పించుకోడానికిన్నీ స్త్రీలు గర్భధారణవ్యాపారం కట్టిపెట్టడం తప్ప అన్యశరణ్యంలేదు.

పాటకప్రజనుల్లోనూ, అనాగరికుల్లోనూ ప్రసవం ఒక సమస్యగా లేనిమాట నిజమే. కాని నాగరికత బలసిన ప్రతిచోటా ప్రసవ సమయంలో నిపుణులసహాయం లేనిదే పని

జరగటంలేదు. బాధకూడా అనాగరిక స్త్రీలకంటె నాగరిక స్త్రీలకు ఎక్కువ అని అదరూ ఒప్పుకునేవిషయమే. అనాగరిక స్త్రీలకంటే నాగరిక స్త్రీలు సున్నితంగాను సుకుమారంగాను ఉంటారు. అందుచేత నాగరిక స్త్రీలకు బాధ తీవ్రంగాను తీక్ష్ణంగాను వుంటుంది. ఇకముందు నాగరికత ఇంకా ప్రబలుతుంది కాని తిరిగి అనాగరికతకు మళ్ళదు. అందుతో బాధయొక్క తీవ్రత, తీక్ష్ణత ఇంకా అతిశయిల్లుతాయి కాని తగ్గవు. కాబట్టి తీవ్రవేదనకు కారణభూతమైన గర్భధారణవ్యాపారమును ఇక స్త్రీలు సాగించకుండా వుండడం వాంఛనీయం అవుతూంది.

పోనీ చూలింతతనంవదిలి బాలింతతనం ప్రారంభించినందువల్ల పాతనష్టాలుపోయి కొత్తగా ఏమైనా లాభాలు కలుగుతాయేమో అంటే అదీలేదు. చూలింతతనానికి పూర్వం ఎంత కాయశరీరమో ఇప్పుడంత గుల్లశరీరం. కాబట్టే మాతృత్వం అనేది నెమ్మది నెమ్మదిగా జరిగే ఆత్మహత్యఅని ఒక సుప్రసిద్ధ శాస్త్రవేత్త అన్నాడు. ఆత్మహత్య ఎట్లు దోషమైంది అవుతుందో ఇదీ అల్లాగే దోషమైంది అవుతుంది. అందులో ఒక్కొక్క పురిటికీ స్త్రీకి ఏదో ఒక్కొక్కవంకర ఏర్పడుతూ వుంటుంది. తాను తనసంతానముతో లోకవిజేత్రి కావాలని మనంకోరే స్త్రీ అమూల్యమైన ఆరోగ్యవిషయంలో చెడిన వస్తువై పురిటిమంచం దిగుతుంది. అడుసు తొక్కనేల కాలుకడగనేల అన్నట్లు గర్భధారణవ్యాపారంలో దిగడమెందుకు ఆరోగ్యమందిరానికి దూరంగా పోవడ మెందుకు?

ప్రకృతిధర్మాన్ని పట్టి చూస్తిమంటే పునరుత్పత్తి చేయుటమే చావుకు విఘ్నేశ్వరపూజ చేయడమౌతుందని అంగీకరింపక తప్పదు. వీస్‌మేన్, గెయిటీ, గెడ్డిస్, థామ్సన్ మున్నగు సుప్రసిద్ధజంతుశాస్త్రజ్ఞులందరూ ఈ విషయాన్ని నిరూపించిఉన్నారు. పెక్కు ప్రాణులు గ్రుడ్లను ఉత్పత్తి చేసిన కొద్దికాలంలో చచ్చిపోతాయి. ప్రసవించడంవల్ల కలిగే ప్రయాస ప్రాణాలను బలిగొనేటంత ప్రబలంగావుంటుందన్నమాట. పునరుత్పాదనశ్రమవల్ల ప్రాణుల్లో ఆడవే కాకుండా ఒక్కొక్కప్పుడు మగవికూడా చనిపోవడంవుంది. ఆడదానికి కడుపుచేసి మగసాలెపురుగులు సాధారణంగా చచ్చిపోతాయి. కొన్నిజాతి ఈగల్లో సంతానోత్పాదనం చాలాప్రమాదకరమైంది. కొన్నికొన్ని ప్రాణుల్లో తల్లిప్రాణం విచ్చితేకాని గ్రుడ్లు పిల్లలు బయటికి రావు. కొన్నికొన్ని ప్రాణులు సంతానాన్ని బయటికిజార్చిన వెంటనే ప్రాణాలు వదులుతాయి. ఒకజాతి ఏలికపాముపిల్లలు తల్లి చచ్చిపోయేవరకూ దానిరక్తంతాగి బ్రతుకుతాయి. తల్లి మర్మావయవాల్ని చీల్చి దాన్నిచంపికాని కొన్ని జాతులప్రాణులు బయటపడవు. ఎన్నివిధాలచూచినా ప్రకృతిలో సంతానోత్పాదనం తల్లిప్రాణాల్ని లాగేదిగానే వుంటూవుంది. మానవులవిషయంలో కూడా అంతే. కాని ఇక్కడకూడా పర్యవసానం ప్రాణనాశనమేఅయినా అది తెలియని రీతిగా నెమ్మదినెమ్మదిగా జరుగుతూవుంది. జంతువులకంటె మానవులు తెలివైనవాళ్లు కాబట్టి ఈ అపాయాన్ని తప్పించుకోవాలి. అట్లు తప్పించుకోడానికి స్త్రీలు గర్భధారణవ్యాపారం మానడంకంటె ఉత్తమమైంది, ఉచితమైందిఅయిన ఉపాయం మరోటిలేదు. ఈ ఉపాయంచేత మన ఆ అపాయాన్ని తప్పించుకోకపోతే మనంకూడా వివేకంలేని జంతువుల్తో సమానంఅవుతాం.

ఎప్పుడికయినా చచ్చిపోవలసిన వాళ్ళమే కాబట్టి చావుకుభయపడి సంతానోత్పాదనం మానడం మంచిది కాదనుకున్నా సంతానోత్పాదనంతో బ్రతికున్న నాలుగురోజులూ ఏమీ సుఖంవుండదు. చూలింతతనంలోవుండే కష్టాలు మనవిచేసేవున్నాను. ఇక బాలింతతనంలోనూ అట్లాంటికష్టాలే. మరోప్రాణి కోసం మనంనోరు కట్టుకోవాలి. ఇష్టంవచ్చిన పదార్థాలు తిండానికి మొగంవాచి తల్లిఅయిన ప్రతి స్త్రీ బ్రతికిన నాలుగురోజులూ చచ్చిపోవాలి. పరోపకారం పుణ్యప్రదమైందని చుక్కలుడుల్లేకబుర్లు చెప్పవచ్చు. కాని బ్రతికిన నాలుగురోజులూ తనకుమాలిన ధర్మంచెయ్యమంటే బ్రతుకుమీదే ఆశపోతుంది.

ఎంతఆశపోయినా ఎల్లాగో ఒకలాగ శొంఠిపొడి, మిరియాల చారుతోనే సరిపెట్టుకుని తల్లి పిల్లలకు పాలిస్తుందనుకోండి. జిహ్వకట్టిపెట్టుకోవలసిన నష్టమేకాకుండా పిల్లకు పాలివ్వడంవల్ల ఆతల్లి వక్షోరుహాలు దింపులువోయి అందంఅంతా చెడిపోతుంది. ఒకప్పుడు ఆమె మానసికోత్సాహానికి, ఆంతరంగికగర్వానికి కారణమైన ఆమె స్తనసంపద దిగనాశిపోతుంది. ఇప్పుడు స్త్రీ పాలను ఉత్పత్తిచేసే ప్రాణంగలయంత్రం. పాలు సమంగాను, చాలినన్ని ఉత్పత్తిచేయలేకపోయిందా ఆమెను ఇంటిల్లపాదీ విసుక్కునీ, పిల్ల ఎడతెగకుండా ఏడ్చి ప్రాణాలు తోడేస్తారు. పాలివ్వడంవల్ల తల్లి బలహీనురాలు అవుతుంది; ఆమెకు ఓజోనాశనం, ప్రాణశక్తియొక్క తగ్గుదల కలుగుతుంది. పాలు ఎక్కువైతేనూ బాధే. జ్వరం కూడావస్తుంది. స్తన్యపానకాలంలో స్తనాలకి సంబంధించి స్త్రీలకు కలిగే జబ్బులు ఎన్నో వున్నాయి. వాని అన్నిటినుండీ దూరంగా వుండాలంటే స్త్రీ తల్లిఅవడం మానుకోవాలి.

తల్లి అవడం మానుకోకుండావుంటే స్త్రీ కొద్దికాలంలోనే ముసలమ్మ అవుతుంది. ముసలితనమంత నికృష్టదశ అదేకాని మరోటిలేదు. వయస్తంభనంచేసుకుని చిరకాలం ప్రాపంచిక సుఖాలు అనుభవించడంమీద కాంక్షగల ప్రతి స్త్రీ గర్భధారణవ్యాపారానికి దూరురాలుగావుండాలి.

అదీకాక భుక్తికోసం ఏదోవృత్తి అవలంబిస్తేకాని స్త్రీలకుకూడా జరగనిరోజులు వచ్చాయి. సంతానోత్పాదనం వృత్తికార్యనిర్వహణానికి పెద్ద అడ్డంకుగా వుండక మానదు. ఈ హేతువుచేత తల్లి అవడం అనేపనిని ఇక స్త్రీలు కటిపెట్టాలని తేలిపోతోంది.

సంసారధర్మంలోవుండే అర్థపురుషార్థాన్ని కామపురుషార్థాన్ని పురుషుడే పూర్తిగా పొందుతూవున్నాడు. అట్టూపిట్టూ పురుషుడిదీ రవ్వాకట్టూ స్త్రీది అవుతూంది. పిల్లల్ని కనిపెంచే కష్టమంతా స్త్రీది. ఆ కష్టంలో పురుషుడు ఏమిన్నీ పంచుకోటంలేదు. మనకు తెలియనిరోజుల్లో పురుషుడి ఈ జులుం సాగింది. సమానస్వాతంత్రంకోరే ఈరోజుల్లో ఇకదానికి తుదిచీటి ఇవ్వాలి. ఇల్లా ఇవ్వడానికిన్నీ తల్లికావడం అనేపనినుండి స్త్రీ విరమించడమే ప్రధానసాధనం.

గర్భధారణవ్యాపారంలో ఇన్నినష్టాలు ఇమిడిఉన్నాయి కాబట్టి ప్రతి స్త్రీ ఆ వ్యాపారాన్ని విరమించి 'తల్లినగుట నాకు ఇష్టము లేదు' అని లోకానికి చాటిచెప్పాలి. అట్లు చెప్పి ఆమె ఆరీతిని ఆచరించగలిగినప్పుడే ఆమెకు చూలింతతనము బాలింతతనము అనే వింతఅవస్థలు, వానితో జతపడిఉండే రోగవిశేషాలు తప్పి ఆమె ఆరోగ్యంగాను ఆనందంగాను జీవించగలుగుతుంది; తన్ను తాను ఉద్ధరించుకోగలుగుతుంది.

# దీపావళియమునిపండుగ

రచయిత:

ఎ. శేషాచలపతి, బి. ఏ.

లోకకంటకుడైన నరకాసురుణ్ణి శ్రీకృష్ణుడు సంహరించినదినము నరకచతుర్దశి అనీ, ఆ అసురుని మరణానికి సంతోషించి లోకులు మరునాడు ఆచరించుకొన్నపర్వం దీపావళి అనీ మన ఆంధ్రులనమ్మిక. అరవసోదరులకుకూడా ఇదే నమ్మిక. కాని ఉత్తర హిందూదేశంలోనివారికి ఈ సంగతి తెలియనే తెలియదు. వాళ్ళకూ మనలాగే నరకచతుర్దశిపర్వమూ, దీపావళిపండుగా ఉన్నాయి. కాని అచట ఈ పర్వానికి నరకాసురసంహారానికీ ఏమీ సంబంధం లేదు. అందుకుతగ్గట్టుగా మన ప్రాచీనపురాణాల్లో ఒకదానిలోకూడా నరకచతుర్దశితో నరకాసుర సంహారానికి సంబంధంఉన్నట్లు చెప్పబడలేదు.

అయితే ఈ నరకాసురుడు ఎవడు? నరకచతుర్దశిలోని నరకశబ్దానికి నరకాసురలోని నరక శబ్దానికి ఏమన్నా సంబంధంవుందా?

దీపావళి అనేది 'దీప-ఆవళి' అను రెండుపదాల సమాసం అయినట్లే నరకాసుర అనేది 'నరక-అసుర' అనే రెండుపదాలసమాసం. నరక అంటే నరక లోకం అని సులభంగానే అర్థమౌతుంది. కాని అసురశబ్దానికి ఇపుడు ప్రచారంలోవున్న అర్థంచెప్పి ఇచట అన్వయంచేయడానికి పొసగుబాటు కావటం లేదు.

ఇప్పటివాడుకలో అసురశబ్దానికి రాక్షసుడని అర్థం. కాని ఆదికాలంలో అనగా ఋగ్వేదకాలంలో అసురశబ్దానికి దేవుడని అర్థం. ఋగ్వేదంలో అసురశబ్దంతోనే దేవుళ్లు సంబోధింపబడ్డారు. ప్రభువు, యజమాని అనే అర్థంలోకూడా అసుర శబ్దం వాడబడింది. మనంఇపుడు సురులుగాను దేవతలుగాను పేర్కొనే ఇంద్రుడు, వరుణుడు, అగ్ని మొదలయినవారంతా ఆనాడు అసురశబ్దంతోనే వ్యవహరింపబడేవారు. క్రమంగా అసురశబ్దంయొక్క అర్థంలో మార్పుఏర్పడి చివరికి రాక్షసుడికి పర్యాయపదంగా స్థిరపడింది. దేవాసురయుద్ధం అయిన దరిమిలాన్నే అసురశబ్దానికి ఈపాడుఅర్థం కలిగింది. ఈ యుద్ధంలో యముడు అసురులతో కలిసి దేవతలతో యుద్ధంచేశాడు.

ఈ విషయాలు తెలుసుకున్నమీదట ఇపుడు నరకాసుర శబ్దానికి అర్థం సులభంగా తెలిసిపోతుంది. నరకాసురలోని నరకశబ్దానికి అర్థం నరకలోకం, అసురశబ్దానికి అర్థం ప్రభువు. నరకాసురుడు అంటే నరకలోకప్రభువు అన్నమాట. అయితే యీ నరక లోకప్రభువు ఎవరు? ఎవర్నిఅడిగినా అతగాడు యముడు అనిచెపుతారు. యమశబ్దంకంటె నరకాసురశబ్దం ప్రాచీనమైంది. వింధ్యకు దక్షిణమున యమశబ్దంకంటె నరకాసురశబ్దం చిరపరిచయమైంది. అందులో దక్షిణాదివాళ్లు నరకాసురశబ్దంలోని అసురశబ్దాన్ని రాక్షసుడికి పర్యాయపదంగా తీసుకుని దీన్ని శ్రీకృష్ణుని నరకాసురసంహారానికి ముడి పెట్టారు.

ముడిపెట్టారు. కాబట్టే దీనికి ఏపురాణంః ఆధారందొరకదు. నరకచతుర్దశినాడు, దీపావళి నాడు జరిగే ఆచారాలు ఉత్తరహిందూదేశంలోను, దక్షిణహిందూదేశంలోను ఒకరీతిగానే ఉన్నా వాని ఉద్దేశాలుమాత్రం వేరై, వాని అంతర్యాలుమాత్రం

భిన్నమై ఉన్నాయి. అక్కడా ఇక్కడా నరక స్మరణవుంది. కాని ఇచ్చటి నరకస్మరణ వాని మృతికి సంతోషించేదిగాను; అచ్చటి నరకస్మరణ నరక పాలకుడైన యముణ్ణి పూజించేదిగాను వుంది. అక్కడాఇక్కడా అభ్యంగనస్నానంవుంది. కాని ఇచ్చటి స్నానం నరకుడు సంహరింపబడినందుకు సంతోష సూచన; అచ్చటిస్నానం యముణ్ణి పూజించేటందుకు చేసే కార్యకలాపంలోని ప్రయత్నవిశేషం. అక్కడాఇక్కడా దీపాలు వెలిగించడంవుంది. కాని ఇచటి దీపాలు శ్రీకృష్ణుని విజయానికిఎత్తిన దివ్వెలు; అచటి దీపాలు యమున్ని ఆరాధించడానికి ఎత్తిన జ్యోతులు ఇక దీపావళితో మనం నరకాసురుణ్ణి వదిలేస్తాము. వాళ్లు యమున్ని ఇంకా వదలరు. దీపావళి వెళ్ళిన రెండోనాడు అతనికి సంబంధించిన యమద్వితీయ అనే పర్వంచేస్తారు.

ఈ యమద్వితీయ విచిత్రమైనపర్వం. కార్తిక మాసంలో శుక్ల విదియనాడు చేయవలసింది. ఇది ఎట్లు యమసంబంధమైనదిగాఉందో పెద్దలు ఇల్లా చెపుతారు. యమునికి యమునానది చెల్లెలు. యీమె తనఅన్నను రోజూ తనయింటికి భోజనానికి పిలుస్తూ వుండేది. పితృలోకవ్యవహారాలతో అతనికి నిమిష మేనా తీరికవుండేదికాదు. కాబట్టి ఎన్నోరోజులు చెల్లెలికి ఆశాభంగంకలిగించి తుదకు ఎట్లో తీరిక చేసుకొని ఒకనాడు అమెయింటికి వెళ్లాడు. ఆనాడు కార్తిక శుక్లద్వితీయ. చెల్లెలుచేసిన విందుకు అన్న సంతోషించి ఆమెను ఏదైనా వరం కోరుకోమని చెప్పేడు. దానికి ఆమె 'ప్రతీయేడు నీవు యీరోజున వచ్చి మాయింట్లో భోజనంచెయ్యాలి. మరిన్నీ యీ రోజున ఎవరు తనతోడబుట్టినఆమె వండి వడ్డించిన అన్నంతింటారో వారికి నరకలోకప్రాప్తిలేకుండా చేయాలి' అని వరాలుకోరింది. చెల్లెలుకోరినవరాల్ని ఇచ్చి అన్న యింకా ఇల్లా చెప్పాడు.

'ఇకమీదట యమద్వితీయ అని పిలవబడే కార్తిక శుక్ల విదియనాడు ఏగృహస్థు యమునానదిలో స్నానంచేసి పితృదేవతలకు తర్పణాలుఇచ్చి తనతోడబుట్టినదాని యింటికివెళ్ళి, ఆమెను సత్కరించి పూజించి ఆమెవండివడ్డించిన అన్నాన్ని తింటాడో అతను ఎన్నడూ నరకద్వారాన్ని చూడడు. ఆదినం నాటి భగినీహస్తభోజనంవలని పుణ్యఫలంగా అతను పరలోకంలో అనంతసుఖాలు అనుభవిస్తాడు. మరిన్నీ ఆనాడు ఏభగిని తనసోదరుని తాను వండివడ్డించిన అన్నంతో సత్కరిస్తుందో ఆమె ఎన్నివేల స్త్రీజన్మాలెత్తినా వైధవ్యంఅనేదోషాన్ని పొందకుండా వుంటుంది.'

మన సంహితాగ్రంథాలు యమద్వితీయాపర్వాన్ని గూర్చి వివరంగా చెప్పివున్నాయి. అవి యమునికి దీపావళికి వుండే సంబంధాన్నికూడా వివరంగా చెప్పివున్నాయి. ఆ గ్రంథాల్లోని యీ పర్వసంబంధమైన వాక్యాలు పరిశీలిస్తే నరకచతుర్దశిపర్వము నరకలోకాన్నుండి పితృదేవతలకు విముక్తికలిగించుటకు ఉద్దేశింపబడిందిగా ద్యోతకమౌతుంది. నరకచతుర్దశినాడు నరకలోకమునుండి పితృదేవతలు స్వర్గలోకాన్ని పొందుటకై యముణ్ణి పూజించి, దీపావళి అమావాస్యనాడు పితృదేవతలకు నరకాన్నుంచి స్వర్గానికి మార్గం సుకరంగా తెలియడానికిగాను దీపాలుపెట్టి యీ లోకవాసులు పితృదేవతల అభ్యున్నతికి శ్రద్ధపెట్టడంకోసం ఆ రెండురోజులూ నిర్దేశింపబడ్డట్లు నిశ్చయమౌతూంది.

పురాణగ్రంథాలు ఇట్లా చెపుతున్నాయి కూడాను: 'నరకచతుర్దశినాడు నరకక్షయమునకై స్నానము చేయవలెను. ఆనాడు నరకాధిపతియగు యమమహారాజును దీపములతో పూజించువారి పితరులు నరకమునుండి విడుమరకాంచి పుణ్యలోకమును పొందుదురు.'

---

సవరణ : ౧౮౪-వ పుటలో 2-వ కాలం 6-వ పంక్తిలో 'నీటియందు నశించునుగాన' అనుదానికి బదులు 'నీటియందు నివసించునుగాన' అని చదువుకొనవలెను.

# వైద్యులయింటిచుట్టూ దెయ్యాలే

రచయిత:
దేశరాజు వీరభద్రరావు

పూర్వం కాశీలో ధనగుప్త అనే గొప్ప షాహుకారుండేవాడు. అతనిభార్యపేరు లక్ష్మీదేవి. కోస్తావర్తకంచేసి లక్షలకొలది ధనం గణించాడు. ఆ దంపతులకి శరీరాలు వేరైనా ఆత్మలు ఒకటిగానే వుండేవి. కష్టము దుఃఖము అనేవియెట్టివో వారెరుగరు. ఇట్లు కొంత కాలం సుఖంగా వెళ్ళబుచ్చారు. ఒకనాడు వారి యేకపుత్రుడైన ప్రభాకరుడికి హటాత్తుగా జబ్బుచేసింది. వర్తకవ్యవహారాలు చూసుకుంటూ కొట్టులోవున్న గుప్తగారికీ సంగతి తెలియలేదు. రాత్రిపొద్దుపోయేవరకూ ధనగుప్త యింటికిరాడు. ఇంటివద్దనున్న నౌకరులసహాయంతో లక్ష్మీదేవి యేదో వైద్యంచేసింది. కాని ప్రభాకరుడివ్యాధి యెక్కువ అవుతోవుందికాని తగ్గలేదు. ఆవిడ కంగారుపడి భర్తకు కబురుపంపింది. ధనగుప్తవచ్చి కుమారునిస్థితిచూసి, ఆపట్టణంలో వున్న గొప్పడాక్టరుదగ్గిరకి ప్రయాణమయ్యేడు. కొంతదూరంపోయేసరికి దారిలో ఒక సన్యాసి యెదురై 'బాబూ! నీకు తటస్థించిన కష్టము యేదో నాకు తెలుసును. ఈ రుద్రాక్షమాల నీకు కొంతసహాయంచేస్తుంది. దీనిని నీవద్ద వుండనియ్యి' అని చెప్పి దానిని బలవంతంగా అంటకట్టేడు. మంత్రాలకి చింతకాయలు రాలవనే నవనాగరికుడైనా కాని, సాధువుయొక్క బలవంతంవల్ల ధనగుప్తకి రుద్రాక్షమాల తీసుకోవడం తప్పిందికాదు. ఆరోజుకిసరిపడ్డ గంజాయిఖర్చుతో సన్యాసిని బహూకరించి తనదారిని తాను పోయాడు.

డాక్టరుగారియింటికివెళ్లి చూసేసరికి కొన్నివేలజనులు గుమ్మమువద్ద గుంపుగూడివున్నారు. ఆగుంపులో ధనవంతులు, సామాన్యులు, బీదలు—బాలురు, నడివయస్సువారు, వృద్ధులు—స్త్రీలు, పురుషులు అందరూ కలిసిపోయి, యేవిధమైన వివక్షతలేకుండా నిప్పులు కురిసేయెండలో నిలబడివున్నారు. ధనగుప్తకిదేమీ అర్థంకాలేదు. ఇన్నివేలమందీ మందుకోసమే వచ్చినరోగులై ఉండరు. ఐనా, పెద్ద చిన్న తారతమ్యము, స్త్రీపురుష వివక్షత లేకుండా అంతా కలిసివుండడం అసంభవం. తుదకు ఏమీతోచక అందులో పెద్దమనిషిలా కనబడే ఒకనిని పిలిచి సంగతేమిటని అడిగాడు. అప్పుడాపెద్దమనిషి యీ విధంగా చెప్పడం మొదలుపెట్టేడు. "అయ్యా! మేమందరమూ ఒకప్పుడు యీ డాక్టరుగారిచేత వైద్యంచేయించుకొని చనిపోయినవారి ఆత్మలము. ఈయనవద్ద మందుపుచ్చుకోకపోతే మేము ఆరోగ్యముగానే వుందుము. ఇంత మంది మృత్యువుకీ యీయనేకారకుడు. మీరు కూడా వైద్యముకోసమే వచ్చారా?" అని అడిగేడు. ఇంతలో ధనగుప్తకి సన్యాసియిచ్చిన రుద్రాక్షమాలసంగతి జ్ఞాపకము వచ్చింది. దానిశక్తివల్లనే వీళ్లనుచూసి వీళ్లతోమాట్లాడకలిగేను అని తెలుసుకున్నాడు.

అక్కడనుంచి తిన్నగా కాశీరాజుగారి ఆస్థానవైద్యుడిదగ్గిరకి వెళ్లేడు. ఆయనగుమ్మం

వద్ద మునపటిగుమ్మంవద్దకన్న రెట్టింపుజనం వున్నారు. అక్కడనుంచి మరొకభిషగ్వరుని యింటికి పరుగెత్తేడు. అక్కడా యిల్లాగే వున్నారు. ఇంకో హకీంయిల్లుచూశాడు.అక్కడ కూడా ఈదృశ్యమే కనపడింది. ఆ పట్టణమంతా వెతికేడు. దయ్యాలగుంపులేని డాక్టరు యిల్లు కనపడలేదు. ఎవర్నో ఒకవైద్యుణ్ణి తీసుకువెళ్ళకపోతె కొడుకువ్యాధి ఎల్లాపరిణమిస్తుందో అని భయం, ఎవరిని తీసుకువెళ్ళడానికీ మనస్సు ఒప్పుకోడంలేదు.

మరొక చిన్నవీధులోకిమళ్ళి, అక్కడ ఎవరేనా డాక్టరులున్నారేమో అని చూశాడు. ఒక వైద్యశాలకనుపించింది. ఈయనగుమ్మం దగ్గిర గుంపులేదు. ఇద్దరుమాత్రం వున్నారు. సన్యాసియిచ్చిన రుద్రాక్షమాల మెడలో వుందాలేదాఅని చూసుకున్నాడు. అది యధాప్రకారం మెడలోనేవుంది. దానిమాహాత్మ్యం పోయిందేమో అని అనుమానం కలిగింది. పోతే "ఈ యిద్దరుమాత్రం యెల్లాకనుపిస్తారు? కాబట్టె వీరిద్దరి ఆయుర్దాయముతీరిపోయి వుండవచ్చును. వైద్యునివద్దకు వచ్చినవాళ్ళందరూ యెక్కడ బ్రతుకుతారు? ఎల్లాగైనా తక్కినవైద్యులకన్న ఈయన చాలా తెలివిగలవాడై యుండాలి" అని నిశ్చయించుకుని ఆ డాక్టరుగార్ని తనయింటికి తీసుకొనివెళ్ళేడు.

వీరు యింటికివెళ్ళేసరికి ప్రభాకరుడు వీధులో ఆడుకుంటూవున్నాడు. వైద్యాపేక్షలేకుండానే వ్యాధి నిర్మూలించింది. డాక్టరుగార్ని వూరికే పంపడం బాగుండదని ఫలాహారములు మొదలైనవియిచ్చి, ఆయన్ని తీసుకువచ్చిన సంగతి ఆయనతో చెప్పి, పిల్లవాణ్ణి చూపించాడు.పిల్లవాడు ఆరోగ్యంగావున్నాడు.డాక్టరుగారు వెళ్లేటప్పుడు ధనగుప్తతో 'అయ్యా' ఈ పట్టణంలో ఇంతమంది గొప్ప డాక్టర్లుండగా నన్ను యెందుకు తీసుకువచ్చారండీ" అని అడిగేడు. అందుకు ధనగుప్త "మిమ్మల్ని గురించి, మీవైద్యప్రావీణ్యమునుగురించి ఈ పట్టణవాసు లనేకవిధములచెప్పుకొని, మిమ్ము పొగడుతోవుంటారు. తక్కిన డాక్టర్లు మీకంటె గొప్పవారా?" అని ఆయన్నిసంతృప్తిపఱచాడు. కాని, డాక్టరుగారి కిది ఆశ్చర్యంగానే కనుపించింది. "నాకింతపేరు రావడానికి కారణమేమీ కనుపించదండీ నేను మొన్ననే యీపట్టణంచేరాను. మొన్న ఒకనికి, నిన్న ఒకనికిమాత్రమే వైద్యంచేశాను. ఇంతలో నన్ను పట్టణమంతా పొగడవలసినకారణమేముంది?" అని ప్రశ్నించాడు.

ధనగుప్తుడికి వైద్యరహస్యం అర్థమైంది. ఈ డాక్టరుగారి యింటిగుమ్మంవద్దవున్న యిద్దరూకూడా దెయ్యాలే.

---


# నిజాము రాజ్యమునకు

వెంకట్రామా అండు కో; 3993 మార్కట్టుస్ట్రీట్, శికిందరాబాదు.

అనువారిని ఆంధ్రభూమికి ఛీఫ్ ఏజెంటులుగ నియమించినాము. బ్రిటిష్ పోస్టలు సౌకర్యములు లేక ఆంధ్రభూమికి చందాకట్టుటలో ఇబ్బందిపడుచున్న నిజామురాష్ట్రాంధ్రులు ఇకమీదట తమ తమ చందాధనమును వారికి పంపుచు ఆ విషయమును ప్రత్యేకముగ మా కార్యాలయమునకు కూడ తెలుపుచుండగలరు. శికిందరాబాదు, హైదరాబాదు వాస్తవ్యుల సౌకర్యార్థము వీరు మాసము మాసము ఆంధ్రభూమి విడిసంచికలు విక్రయింతురు.

# మ ణి మా ల

## దీపావళి : లక్ష్మీపూజ

దీపావళి ఎందుకు చెయ్యాలని పెద్దల్ని అడుగుతే దానికి పలువురు పలువిధాలుగా కారణాలు చెపుతారు.

శ్రీకృష్ణుడు సత్యభామతో కూడి లోకకంటకుడైన నరకాసురున్ని సంహరించినదానికి స్మరణగా మనం ఈ పండుగను జరుపుకుంటున్నామని ఒకరంటారు.

శ్రీరాములవారు లంకలో రావణుణ్ణిచంపి సీతాసమేతులయి అయోధ్యకువచ్చి ఈరోజున రాజ్యానికి పట్టాభిషిక్తులయ్యారు కాబట్టి ఆ సంతోషానికి సూచనగా దీపావళి జరుపుకుంటున్నామని మరొకరు అంటారు.

వామనమూర్తి బలిచక్రవర్తిని పాతాళలోకంలోకి ఈనాడు అణచివైచినాడు కాబట్టి దానిజ్ఞాపకార్థం దీపావళి జరుపుకుంటున్నామని వేరొకరు అంటారు.

పితృదేవతలను నరకలోకమునుండి విముక్తిపొందించి స్వర్గలోకానికిచేర్చుటకై యముణ్ణి ప్రార్థించడానికిగాను ఈపర్వాన్ని ఆచరిస్తున్నామని ఇంకొకరు అంటారు.

ఇట్లా అందరూ అన్నిమాదిరులుగాను చెపుతారు. కాని ఆచరణలోమాత్రం వీటిఅన్నిటికి భిన్నంగా ఈనాడు లక్ష్మీపూజ జరపబడుతుంది ఎవర్నిఅడిగినా ఇది లక్ష్మీపూజకు నిర్దిష్టమైన దినంగా చెప్పరు. కాని ఏపంచాంగంచూసినా 'దీపావళీ లక్ష్మీపూజా దీపాదాన' ఇత్యాదిగా వుంటుంది. పంచాంగంలో దీపావళినాడు లక్ష్మీపూజచేయాలని వ్రాసిఉంటుంది; ఆచరణలో ఆనాడు ఏదోరీతిని మనం లక్ష్మీపూజ చేస్తాము. కాని ఈదినం లక్ష్మీపూజకు ఉద్దిష్టమైందని చెప్పలేము, అసలు ఈదినం అట్లు లక్ష్మీపూజకు ఉద్దిష్టమైనట్లు మనలో చాలామందికి తెలియదు కూడాను.

అయితే దీపావళి లక్ష్మీపూజకు ఉద్దిష్టమైనట్లు తెలియకుండాను, చెప్పలేకుండాను మనం ఆనాడు లక్ష్మీపూజ చేస్తున్నామంటే చాలామందికి ఆశ్చర్యంగావుంటుంది. మనతెనుగువారిలో ఈపూజ ఉన్నదన్నా ఓపట్టాన్ని నమ్మకంకుదరదు. మోచేటిపద్దమ్మనోము, మాగిగౌరునోము, బతుకమ్మనోము మొదలైన నోములన్నీ లక్ష్మీప్రార్థనకు ఉద్దిష్టమైనవే. ఆనోములు ఒకదీపావళినాడే ప్రారంభించాలి కాని సంవత్సరంలో మరోరోజున ప్రారంభించకూడదు. లక్ష్మీప్రార్థనకు ఉద్దిష్టమైన ఇల్లాంటివ్రతాలు మన తెనుగుదేశంలోనే కాకుండా మనపొరుగునవున్న తమిళదేశంలోను, మళయాళదేశంలోను, కన్నడదేశంలోను ఈనాడేపట్టడం ఆచారంఅయివుంది. ఈ విధముగా దీపావళినాడు లక్ష్మీపూజ మనదేశంలో సాగుతూ వుంది.

ఉత్తరహిందూదేశంలో దీపావళినాడు లక్ష్మీపూజ ఇంకా ప్రత్యక్షంగాను ప్రబలంగాను సాగుతుంది. టాడ్‌వ్రాసిన రాజస్థానచరిత్రలో రసపుత్రులు దీపావళినాడు లక్ష్మీపూజ ఎట్లాచేస్తారో వివరంగా వ్రాసిఉన్నాడు.

దీపావళినాడు లక్ష్మీపూజ బ్రహ్మాండంగాను ప్రబలంగానుచేసే భారతజాతుల్లో ఘూర్జరదేశస్థులు అగ్రగణ్యులు. గుజరాతీదేశస్థులకు దీపావళితో పాతసంవత్సరంముగిసి క్రొత్తసంవత్సరం ప్రారంభమాతుంది. అనగా గుజరాతుదేశస్థులకు దీపావళి తెనుగువారి ఉగాదివంటిదన్నమాట. గుజరాతు దేశీయుల గు మార్వాడీలుఇపుడు ఆంధ్రదేశంలో ప్రతిపెద్దఊళ్లోను ఉన్నారు. వడ్డీవ్యాపారము, ఇతరవ్యాపారముచేస్తూవుంటే ఆ మార్వాడీలు దీపావళికి గొప్ప ఉత్సవం చేస్తారు. ఆనాటికి పాతలెక్కలన్నీ పరిష్కారం చేస్తారు. చిత్తాఅవర్జాపుస్తకాలు క్రొత్తవిపెడతారు. సాయంకాలము రూపాయిలు, కాసులు రాసిగా పోసి

తమకొట్లలో లక్ష్మీపూజచేస్తారు. దానికి బ్రాహ్మల్ని పిలిచి మంత్రాలుచదివిస్తారు. మిత్రుల్ని ఆహ్వానించి చందనతాంబూలాదులతో సత్కరిస్తారు. ఈనాడు కొత్తపుస్తకాలు కొత్తవిపెట్టేఆచారాన్ని ఇప్పుడిప్పుడు మన ఆంధ్రవర్తకులుకూడ అక్కడక్కడ అవలంబిస్తున్నారు. ఇట్లీదినము లక్ష్మీపుత్రులకు పూజ్యదినమై వారిఅభిమానదేవతయగు లక్ష్మీయొక్కపూజకు ప్రత్యేకింపబడియున్నది.

* * *

## ప్రపంచంలో కవలపిల్లల పుట్టుక

ప్రపంచంలోనిదేశాల అన్నిటిలోనికి డెన్మార్కులో కవలపిల్లలపుట్టుక హెచ్చు; కొలంబియాలో మిక్కిలితక్కువ; యునైటెడ్‌స్టేట్సుఆఫ్ అమెరికాలో మిక్కిలిహెచ్చు మిక్కిలి తక్కువ కాకుండా మధ్యస్థంగావుంటుంది. డెన్మార్కులో ప్రతి 63 పుట్టుకలకి ఒకకవలపిల్లలపుట్టుకౌనున్నూ, కొలంబియాలో ప్రతి 250 పుట్టుకలకి ఒకకవలపిల్లలపుట్టుకౌనున్నూ, యునైటెడ్‌స్టేట్సుఆఫ్ అమెరికాలో ప్రతి 87 పుట్టుకలకి ఒకకవలపిల్లలపుట్టుకౌనున్నూ అగుచున్నది. ప్రపంచం మొత్తంమీద సగటున ప్రతి ఒక 85 పుట్టుకలకీ ఒకకవలపిల్లలపుట్టుకచున్నది.

—Literary Digest.

* * *

## నరకచతుర్దశి : దీపావళి

పూర్వము పృథ్వీపుత్రుడైన నరకుడు ప్రజాకంటకుడై యుండెను. అతడు వరుణునిఛత్రమును, అదితికుండలములను బలిమినిదీసికొని, మేరుపర్వతమును మణిపర్వతస్థానములను గైకొనగా నింద్రుడు వానిదుర్ణయములను కృష్ణుని కెరింగించెను.

అంత నతడు సత్యభామాసమేతుడై గరుడునెక్కి నరకునిపురమైన ప్రాగ్జ్యోతిషమునకు పోయెను. కృష్ణుడు తనగదచే నున్నతములైన ఆపట్టణపు పర్వతదుర్గములను, బాణములచే అచటి శస్త్రదుర్గములను, సుదర్శనముచే జలాగ్నివాయుదుర్గములను భేదించి పాంచజన్యమును బూరించగా దానిధ్వని పిడుగువలె నలుదెసలు మారుమ్రోగెను.

అంత నరకాసురుడు కృష్ణునితో కయ్యమునకు డీకొనెను. గదయు శూలమునుద్రిప్పుచు కృష్ణుని మీదికి ఉరుకనుద్యుక్తుడైన వానిని బాణములచే నొప్పించి, కొంతవడి యుద్ధముచేసెను. వాడును నిర్లక్ష్యముగా కృష్ణునితో కొంతవడి యుద్ధముచేసెను. మాయాయుద్ధముచే కృష్ణుని కొంతతడవు చిక్కులుపెట్టవలెనని చూచెనుగాని భగవంతుడును అమోఘవీర్యుడునుగాన తనతెంపులేని బాణపరంపరలచే అద్రియంతయు ఒక్కపెట్టున నణచెను. నరకుడు గొప్పగుహవలెనున్న తననోటినిదెరచి పెద్దసింహనాదము చేసి కృష్ణునిపై శతఘ్నిని బ్రయోగించెను. భగవానుడు దానిని లక్ష్యముసేయక వానిని వానిసైన్యమును బాణపరంపరలచేగొట్టెను. అంత నాయసురుడు శక్తియను నొకయస్త్రమును గరుడునిపై ప్రయోగించెను. అపుడు కృష్ణుడుమూర్ఛపోయెను. అంత సత్యభామ విల్లంది నరకునితో యుద్ధముచేసెను. ఇంతలో కృష్ణుడుతేరుకొని తిరిగి కయ్యముచేయదొడగెను. ఇది చూచి నరకుడు క్రుద్ధుడై గరుడునిపైనను కృష్ణునిపైనను వరముచేపొందిన తనశూలమును ద్రిప్పుచు మీదికి విసర సంసిద్ధుడయ్యెను. అంత కృష్ణుడు తన సుదర్శనముచే వానిశిరము ద్రుంచెను. పద్మరాగములతోచేయబడిన కిరీటముతో మెరయుచున్న ఆ అసురునిశిరము నేలపైబడెను. వెంటనే వానియాత్మ పరమాత్మునియందు లీనమయ్యెను. అనంతరము కృష్ణుడు నరకునిచే చెరయందుంచబడిన పదునారువేల రాజకన్యలనువిడిపించి ద్వారకానగరమునకు బంపెను. నరకాసురసంహారముజరిగిన ఈదినము ఆశ్వయుజబహుళచతుర్దశి. నాటినుండియు ప్రతి ఆశ్వయుజబహుళచతుర్దశిదివసమున నరకచతుర్దశి అని మన పెద్దలు వచింతురు. ఆనాడు భారతదేశములో నందరును తైలాభ్యంగనము లాచరించి మరునాటిరాత్రి టపాకాయలు మొదలగు బాణాసంచాతోను, పిండివంటలతోను సంతోషముగా కాలముగడుపుదురు.

—చింతా బాలసుబ్రహ్మణ్యము.

# 'పెళ్లాన్ని వంచుకోలేని చచ్చు పెద్దమ్మ'

రచయిత:

తంగిరాల రామనాథము

౧

'మా యిరుగుపొరుగువాళ్ళ దుంపశుద్ధి యెప్పుడవుతుందో కాని, ఆ పీనుగుల కెప్పుడు మాగోలేట, నా కోడలును నేను తిట్టుకుంటాను, దీవించుకుంటాను, వాళ్ళకెందులకమ్మా! ఏమయినాయంటే, అన్నపూర్ణ గయ్యాళి ముండంటారు.' అంటూ సణగుకుంటూ రుసరుసలాడుచు అన్నపూర్ణమ్మ పెరటిలోనికి వెడుతోంది.

చేతితో గరటి యొకటిపట్టుకొని, నిప్పుకంటూ పొరుగింటి ముత్యాలమ్మ యప్పుడే పెత్తనాలకు బయలుదేరినది. ఇద్దఱు పెరటిగుమ్మముపద్ద తారసిల్లేరు.

'ఏమిటమ్మా? అన్నపూర్ణమ్మత్తా! యిరుగు పొరుగు అంటున్నావు'—అంది ముత్యాలమ్మ మెల్లగా.

'ఏముంది! ఊరిలో వెధవలకందఱకు మా సంగతే కావాలి. నాకిప్పటికి 50 సంవత్సరాలు దాటినవి. యెన్నడు వీధిబడి యెఱుగను. ఈ చమురుకాళ్ల పెద్దమ్మ నాకోడలు గాబట్టి నా బతుకంతా వీధిబడుతోంది' అని తనవిసురంతా చూపించింది అన్నపూర్ణమ్మ.

'అసలు సంగతేమిటో చెప్పకుండా ఊళ్లో వాళ్ళను తిట్టడము బాగుండదత్తా! ఏదైనా లోపముంటే మీలో మీరు సమర్థించుకోవాలి.' అంది ముత్యాలమ్మ.

అ:—నీవు నాకు నీతులు చెప్పవచ్చావు. మీరంతాగలసి నన్నేమి చేయగలరే?

ము:—సరే! బాగుందిసారి; అది మామేనత్త కూతురుగాదు, నీవుగాకా పోలేదు. అంతా సమానమే. అసలు సంగతేమిటత్తా?

అ:—ఏమని చెప్పుకోను—కడుపు చించుకుంటే కాళ్ళమీద బడుతుంది—ఏమన్నా అంటే నానోట్లోపుండు. జాముప్రొద్దెక్కినది; ఇప్పటికి లేవలేదాయె; ఇంకేలాయేడ్చేది చెప్పుమటే; తెక్కలు ముక్కలయేటట్లు చాకిరీ నాకు తప్పదుగదా!

ము:—చిన్నపిల్ల సుశీల. అయినా బుద్ధిమంతురాలు!

అ:—దానిచిన్నతనము చితుకులేరినట్లే యున్నది. దానింట్లో మనము పనిచేసే దేమిటని దాని ఉద్దేశ్యము. అమ్మమ్మ! ప్రపంచకములో యెంతలేసి ఆడవాళ్ళన్నా యున్నారు.

ము:—వచ్చి వారమేగా అయినది. మెల్లిగా చెప్పి చేయించుకోవాలత్తా!

అ:—నీవు నాకు శ్రీరంగనీతులు చెప్పనక్కఱలేదు. దానిని నేనేమొ కోతపెట్టుచున్నానని పొరుగువాళ్ళంతా చెప్పుకుంటున్నారుట. నన్ను ఆడిపోసుకొన్నవాళ్లు అనుభవిస్తారు,

ము:—నాకెందులకమ్మా! పోతాను ప్రొద్దుపోతోంది.

అ:—'ఆగు, ముత్యాలమ్మతల్లీ! ఇంటిక్రింద ఉండి చెప్పుచున్నాను, నిన్న పిండివిసరే టప్పటికి ఈ తెక్కగూటిలోపట్టిన నొప్పి పోలేదుగదా. చాకిరీచేస్తూంటే మొద్దు లాగ చూస్తుంది కాని, కాస్త అడ్డమూర దుగదా, ఏమైనా అంటే 'అత్తగారు ముండ' అంటారు. ఇంతేనా.

ము:—ఉఁ.........

అ:—అయినా వాడి కర్మముకొద్దీ దొరికింది సంబంధం. ఉద్యోగస్థుల పిల్లను వద్దని మొత్తుకున్నాను.

'పూనినకర్మము పోరుగూరెళ్ళినాపోదు' అని సణుగుతో ముత్యాలమ్మ నిప్పుతీసికొని నిష్క్రమించింది. 'వీళ్ళంతా కలసి నన్ను చేసేదేమిటి? ఎందుకని చూస్తున్నా, ఈరోజు దీనిసంగతి గట్టిగా పట్టిస్తాను.' అంటూ అన్నపూర్ణమ్మ తనపనిమీద వెళ్ళింది.

౨

సుశీల యత్తవారింటికి తొలిసారి కాపురమునకువచ్చి పది దినములైనది. దైవమన్నను, పెద్దలన్నను మిక్కిలి భక్తిశ్రద్ధలు. బాగుగ చదువను, వ్రాయను నేర్చినదగుటచే మధ్యాహ్నసమయమున, తనకు తీరికయైనప్పుడెల్ల పురాణకాలక్షేపముచేసేది. పేరుకు తగిన ప్రవర్తనముకలదియగుటచే అత్తవారింటికొచ్చి కొలదిదినములైనప్పటికిని మంచికీర్తి సంపాదించినది. సుశీల యన్న యత్తగారగు యన్నపూర్ణకుదప్ప ఊరిలోని యశేషజనమునకు మంచిభావము. 'ఈకాలములో పుట్టవలసినపిల్ల కాదుసుమండీ సుశీల' అంటూ జనులుచెప్పుకొనెడివారు. సుశీలకు గర్వమించుకైనను లేదు. అత్తగారేమన్నను పెదవికదిపి యెఱుగదు.

సుశీల చక్కనిది. శేషగిరిరావుగారి కేక పుత్రికయగుటచే నామె నతిగారాబముగ పెంచి విద్యాబుద్ధులుగఱపిరి. సంగీతమునందుకూడ సుశీలకు ప్రవేశముగలదు. రాత్రిసమయమున తండ్రివద్ద భారతభాగవతములకు అర్థమునేర్చికొని మంచినీతులు గ్రహించినది. సీత, సావిత్రి మొదలగు పతివ్రతామతల్లులవలె తానుకూడ కీర్తిగడింపవలెనని తలచినది.

శేషగిరిరావుగారికి మొదటనుంచీ యల్లుని గూడ తమయింటనే నుంచుకొనవలెనని యుద్దేశము వారట్టిసంబంధముకొఱకై విశ్వప్రయత్నములసలిపిరి. తల్లికి అందము, ఆస్తి గలిగినయల్లుడు గావలెను; తండ్రికి ఆస్తి, చదువుగలవాడు గావలెను. మొత్తము ఎలాగైతేనేమి ఒకటితక్కువగా నిరుపురకునచ్చిన వరుడే దొరికాడు.

సుశీలయత్తవారిగ్రామము తెనాలి. పెండ్లినాటికి విశ్వనాధము ఫోర్తుఫారము చదువుచున్నాడు. సుందరమైన విగ్రహము. పాపము విశ్వనాధమునకు చిన్నతనమునందే తండ్రి కఱవైనాడు. తల్లియన్నపూర్ణమ్మ జీవించియున్నది. ఆమె పట్టుదలమనిషి; అన్నపూర్ణనోటికి జడియనివారు తెనాలిగ్రామమునందొక్కరులేరు; కాని మంచి నిర్వాకస్థురాలు; తాను నడుముకట్టుకొని, ఆస్తి చెల్లాచెదరుగాకుండ వృద్ధిలోనికి తీసికొనివచ్చింది, తనప్రయోజకత్వమువల్ల ఎంత కఱవురోజులలోనైనా విశ్వనాధమునకు ఆస్తిమీద రెండువేలరూపాయీలుసాలీనా వస్తవి. తెనాలిలోనే మంచిగృహముగూడ గలదు.

చదువుతక్కువని శేషగిరిరావుగారు, సుశీలను విశ్వనాధమునకిచ్చుటకు మొదట సందేహించినప్పటికి భార్యపట్టుదలవలన చేయక తప్పినదికాదు. అదీగూడ వృద్ధిబొందకుండా,

పెండ్లిఅయిన మఱునాడే చదువుకు స్వస్తి చెప్పవలసివచ్చింది విశ్వనాథము, తల్లి పట్టు దలవలన-తాము చదువుచెప్పించెదమని శేష గిరిరావుగారు తెనాలిచుట్టూ రెండుమూడు పర్యాయములు తిరిగాడు. కాని, 'తనకొడు కును తనకు దక్కకుండాచేస్తున్నారని అన్న పూర్ణమ్మ గోలచేయుటచే ఆ యుద్యమము నుండి విరమింపవలసివచ్చింది. శేషగిరిరావు గారు ఏదో తినేటందుకుందిగదాయని మన స్సు సమాధానపరచుకొని, సుశీల తలిదండ్రు లూరకున్నారు. అప్పటినుంచీ అన్నపూర్ణమ్మ వియ్యాలవారిపై ఒకవంకపెట్టుకొని కారాలు మిరియాలు నూరుతోనేవుంది.

## ౩

'దీనికి కాఫీయలవాటగుటచే చల్దియ న్నము తిన్నని చెప్పి మూడురోజులనుంచి యుపవాసములు చేస్తోంది; మానివేయనీ, నాకేం; రోజూ ఉడకవేసి ఎక్కడ పాఱవేయ గలను. ఆ అన్నమే ఉంచుతా. ఎన్నాళ్ళ కైనా, దీనిచేత ఆ అన్నము తినిపింపకపోతే నా అత్తగారితనమేమి మండింది; నాలోటు లేకుండా తినమని చెప్పతాను, తినకపోతే దానికర్మం' అంటూ అన్నపూర్ణమ్మ చీపురు కట్టతో వాకిట్లోకివచ్చింది.

'అమ్మా! ఏమిటో అంటున్నావు' అంటూ కండ్లనులుముకొనుచు అప్పుడేలేచి విశ్వనా థముతల్లి కెదురైనాడు.

'ఏముంది! నీమొగము, మనవంశములో పెండ్లామును వంచుకోలేనివాడవు, నీవు బయలుదేరినావు చచ్చుపెద్దమ్మ! ఆడదాని నెప్పుడు కత్తిబద్దగాకుండా కోయవలెనని యెన్నిసారులు చెప్పినా నీకు బుద్ధిలేదేమిరా?

'అమ్మా! మానాన్న నిన్నాలాగ చేసినా తూటే' అన్నాడు విశ్వనాథము మెల్లిగా.

'ఓరి! ఎదిరించమనికూడ నేర్పినది నీకప్పు డే; ఎంతవాడవైనావు; పెళ్ళాముమాట పట్టు కొని నన్ను ఎదిరిస్తావుగా' అని మండిపడింది కుమారునిపై అన్నపూర్ణమ్మ.

'పాప మదేమి ఎఱుగదే, ఊరికే నేనే అ న్నాను, నన్నేమిచేయమంటే అదే చేస్తానే అ మ్మా!' అని మాత్ర దేవతను శాంతింపచేసాడు.

'అబ్బాయీ! నీ పెళ్ళామంటే నాకు మా త్రము కోపమటరా. ఆడదాన్ని ఆజ్ఞలో ఉం చకపోతే నెత్తియెక్కి తొక్కుతుంది. నీకేమి తెలియదు నీయత్తవారిమాట వినకుసుమా! నీవు చెప్పినట్లు వినవలెనని దానిపై నేను లేని పోనికోపము తెచ్చికొని దేవులాడుచున్నాను రా.' అని అన్నపూర్ణమ్మ కొడుకుతో చెప్ప డము మొదలుపెట్టింది.

పాపము విశ్వనాథము కొంచెం అమాయ కుడుకూడాను. 'ఆలాగా, అమ్మా! ఆలాగా!' అంటూ విశ్వనాథము పెరటిలోనికె వెడలి నాడు.

'ఇదింకా ఏమిచేస్తున్నదో' యంటూ చెం బులుతోముచున్న సుశీలవైపు వెళ్ళింది.

అత్తగారువచ్చుట సుశీలచూడనేలేదు.పని ధోరణిలోనే ఉండి ఏదో పద్యాలు చదువు తోంది. 'ఏమే! ముద్దా! నీకాసంగీతము లెందుకే భోగముదానిలాగ; ఇప్పుడు లేచి పని చేయక సంగీతముపాడుచున్నావా' యని కస రుతూ చేతిలోని చీపురుతో సుశీల వీపుపై నొకగట్టిదెబ్బకొట్టినది. సుశీల పాపము నిర్ఘాం తపోయి వెనుకకు తిరిగి జూసినది,అన్నపూర్ణ మ్మవైపు- తనయత్తగారు తన్నెప్పుడు నిష్ఠా రణముగా శిక్షించునని యెన్నడు తలచలేదు. ఆమె యిదివఱకేమైన తిట్టుచున్నను, తనయం దేదో గొప్పలోటుఉన్నదని తలచెడిది. అట్టి సమయమున అన్నపూర్ణమ్మ వీపుపై గొట్టు

టచే ఉడుకుబోతుతనముగలిగినది సుశీలకు. కనులనుండి అశ్రుధారలు ప్రవహింపదొడగినవి.

'ఇంకా దొంగకోళ్ళను పట్టినదానిలా, అలాగా జూసెదవేమిటే; పనిచేయకపోతే నీ యబ్బయెవడు చేయును' అని అత్తగారు సాధింపు మొదలుపెట్టింది. సుశీలకు ఈ మాట మిక్కిలి కష్టము కలిగించింది. ఎంతటి సుగుణులైనను, యెంతకాలము సహింపగలరు?-- 'అత్తయ్యా! పాచిపనులెల్ల జేసి, ఇప్పుడేకదా చెంబులు తోముచుంటిని, నిష్కారణముగా నన్ను దూషించెద రెందుకు!' యని వణకుతూ పలికినది.

ఎన్నడుమాట్లాడి యెఱుగని సుశీల నోటి నుండి ఈ మాటలు వెలువడుసరికి అత్తగారు ఆగ్రహపరవశురాలై 'ఏమిటే! లత్తయ్యా! అంటూ నాకు తీర్పుచెప్పవచ్చావు. అత్తించీ అత్తా! మద్దించీ మామా; యుంటే నీవీలాగు న పొగరెక్కగలవా' యని ఒక్క కసరు కసిరింది సుశీలను. పాపము సుశీల ఏమిసమాధానమియ్యలేదు. 'ఛీ! ముండబ్రతుకు; సిగ్గులేక పోతేసరి, బ్రతగ్గానే సరా'యంటూ విసవిస కోడలివైపుచూస్తో అన్నపూర్ణమ్మ పెరటిలోనికిబోయినది. సుశీల తనపని ముగించుకొని యింటిలోనికి వెడలినది.

## ४

'మాకాలములో అత్తమాట కెప్పుడైనా యెదురాడి యెఱుగుదునా; ఇప్పటి ఆడవాళ్లు ముండకెత్తి అవేవో మీటింగులని, సంగీతసభలని బయలుదేరినారు. పగలు వీధిమొహము జూసి యెఱుగుదునా నేను; అయినాకాని పెళ్ళాలను వంచుకోలేక ఇప్పటి మొగవాళ్లు వట్టి చచ్చుదద్దమ్మలైనారు; సుశీల రోజూ పురాణమంటూ మొదలెట్టినది; అది సాగనివ్వ కూడదు; పుస్తకాలన్నీ బోషాణములో దాచివేస్తాను;ఏంజేస్తుందో ఈప్రొద్దుచూస్తానుగా; దీనిశోభనానికెడితే నాకు మర్యాదజరగలేదు. ఆఖరుకు ఇంత అరిసిముక్కకూడ ఎఱుగను. ఈరోజు దీనబ్బ యెవడడ్డువస్తాడో' అంటూ పుస్తకములుపట్టుకొని బోషాణము దగ్గఱకు వెళ్ళింది అన్నపూర్ణమ్మ.

పుస్తకములేమైనవని సుశీల వెదకుకొనుచు వచ్చి అత్తగారిచేతిలో నుండుట చూసి 'అత్తా! మీరు భాగవతము చదివెదరా; నేను అర్థము చెప్పెద'నని మిక్కిలి సంతోషముతో అన్నపూర్ణను ప్రశ్నించింది. 'పురాణము కాదు, నీపిండాకూడు,అయినా నీ కిప్పటినుండి పురాణములెందుకే' అని అడిగింది కోడలిని అన్నపూర్ణమ్మ.

'అత్తా! భగవంతుని స్మరించుకొనుటకు వయస్సుతో నిమిత్తమేమియునులేదు' అని మెల్లిగా సుశీల బదులిచ్చినది.

'అందుకని శూద్రులను ఇంటికి చేరదీస్తావుగా; సాతాని చూడమ్మతోకూడ నీకు స్నేహమా? నాకు తెలియక అడుగుచున్నాను!'

'అత్తగారూ! శూద్రులకుమాత్రముదైవములేడా, వారిదిమాత్రము భక్తిగాదా'యని అత్తగారి నేవిధముననైన అంగీకరింపజేయవలెనని చూసింది సుశీల.

'ఓసి! వెట్టిపీనుగా! నిన్నను బైరాగి ముండాకొడుకు వచ్చినా డెందులకే, ఆ దొంగవాడు నీకేమైన మొగుడును వలవేసికొనుటకు మందులిస్తానన్నాడా యేమిటి తల్లీ! చెప్పు' యని గద్దించిపలికినది.

అత్తగారిమాటలు వినుసరికి సుశీలకు నవ్వువచ్చినది; అత్తగారు వట్టిఅమాయకురాలని తలచినది; అందుచే 'అత్తా! ఆయన

దొంగకాదు; భగవంతుని భక్తుడు' అని చెప్పినది.

'ఏడిసినట్లేయున్నది నీ తెలివి; అందుచే తనే నీకొఱకు నే నీలాగ దేవులాడుట;— పగలు ముష్టికంటూ బయలుదేరి ఆనుపాను చూసుకొనడము; రాత్రిళ్లు దొంగతనము చేయడము; మరునాడు త్రాగడము వాళ్ల పని— తెలిసిందా? అని అడిగినది అన్నపూర్ణమ్మ సుశీలను. 'నేను నమ్మనంటూ' సుశీల వంటయింటివైపు వెడలినది.

'నమ్మకపోతే నీవుకూడ సన్యాసులలో చేరు. నా యింట్లో ఉండనక్కఱలేదు. అయినాకాని నిన్ననవలసిందేమీలేదు, వాడు వట్టిదద్దమ్మ అయి నీముందు,నీవుఆడించినట్లా ఆడుతున్నా'డంటూ అన్నపూర్ణమ్మ కోపముతో కోడలును వెంబడించింది.

౫

ఎంతభాగ్యమున్ననేమి? సుశీల జీవితము యత్తవారింట. బహుకష్టముగానుండెను. ఎన్నడును పనిచేసియెఱుగదు. పోనీ, అత్తగారి యిష్టమువచ్చినట్లు రేయింబవళ్లు పని చేసి, ఆమెకు తుదకు పాదములువత్తుచున్నను, ఏదో యొకనెపముగల్పించి, సుశీలను, ఆమె పుట్టినింటివారిని సాధించెడిది. అన్నపూర్ణకుమాత్ర మామెయెడల దయరాదు.

తన కష్టసుఖములు చెప్పుకొనుటకు భర్త తనకు స్వాధీనుడుగాడు. తల్లి భార్యతో మాట్లాడమన్నదినముననే మాట్లాడును. ఇట్టిచో ఆమెజీవితమెట్లుండునో గ్రహింపుడు. తొలినాడియే ఇంతదుర్భరముగానున్న ఇకముందు గతియేమి? అత్తవారింటికంపి తలిదండ్రులు మఱల తొంగిచూడరాలేదు. నేటికి నాలుగు మాసములుకావచ్చినవి. కాఫీత్రాగుటమానుటచే చిక్కిసగమై పోయినది. తుదకు ఉత్తరమునందైనను తన పుట్టినింటికి తనుకష్టపడుచున్నట్లు తెలియనీయుటలేదు. రానురాను కష్టమెచ్చుచేకాని తగ్గుటలేదు. తానే తన్ను పిలుచుకొనిపొమ్మని తనతల్లిదండ్రులకు వ్రాయడం అవమానమనుకుంది.

తల్లి సుశీలను పెట్టుచున్న కష్టములు విశ్వనాథమునకు తెలియకపోలేదు. కాని స్వతంత్రుడుగాకపోవుటచే అన్నపూర్ణమ్మగారట్లు అధికారముచేయుచున్నది. 'మాతృదేవోభవా' యనియనుకొని తెలివితేటలుగా ఊరకున్నాడు; లేకపోయినచో తల్లి కానిగూడ తనకు దక్కనివ్వదనిభయము. అయితేనేమి, పాపము జాలిగుండెకలవాడు. నిష్కారణముగా సుశీలను తనతల్లి బాధించుచున్నదని తెలుసు; ఒకటిరెండుపర్యాయములు తన యెదుటనే, అన్నపూర్ణమ్మ తనభార్యను ఊరకే కొట్టుటచూచినాడు. తనుకూడ అనాదరణజేస్తే పాపము సుశీలగతియేమని ఆలోచించినాడు విశ్వనాథము తుదకు.

నాడు అన్నపూర్ణమ్మ పొరుగింటికి పెత్తనానికేగినది. సుశీల, అత్తగారునియమించిన పనులన్నియుజేసి, తనగదియందేమియో సవరించుకొనుచున్నది. విశ్వనాథము ఆ గదియందు ప్రవేశించుటచూసి, చటాలున లేచి నిలుచున్నది. పగలు భర్త సుశీల కంటబడుటిదియే మొదటిసారి. తెల్లబోయి సుశీల భర్తవైపు చూసింది.

'వెఱ్ఱిదానా! భయమునొందకుము; నేను నిన్నాదరించుటలేదని నీఘుందు నాకు ప్రేమలేదనుకొంటివా? మాయమ్మ పెద్దది; చాదస్తము, ఆమెమాటలు నీవుమనస్సునందుంచుకొనకుము; నీవుచేయుపూజలు, ధర్మము మాయమ్మకు' అని యేమొచెప్పబోయినాడు సుశీ

లతో, భర్త. ఇంతలో వచ్చింది ఎక్కడనుంచో అన్నపూర్ణమ్మ వేయిగొంతుకలతో; 'ఎవరురా ఆగదిలో, ఏంజేస్తున్నారు; మీా యిద్దఱుకలసి ఆస్తిఅంతా నీఅత్తవారి బొందమీాదికి, పంపాలని ఆలోచనజేస్తున్నారుటరా; అయినాకాని అసళసంధ్యవేళ నీకు ఆడవారితో మాటలు ఏమిరా,' అంటూ పెద్దపెద్ద కేకలు మొదలుపెట్టినది.

ఏమో! నాకేమి తెలియదే', అంటూ విశ్వనాథము గదినుండి వెడలిపోయినాడు. సుశీలనుజూచి అన్నపూర్ణ 'ఏమిచేటుగాలమొచ్చిబడిందోకాని; మానాడు పగలు మొగవారి కంటబడి మెఱుగుచునా; మాఅత్తగారి గీసిన గీటు కడుగుదాటి మెఱుగుదునా; మొగుడును వలలో వేసుకోడానికి జూస్తున్నావుటే చెప్పు' అంటూ విసురుగా సుశీలవైపు వెళ్ళింది.

౬

రాత్రి 8 గంటలైనది. తెనాలిలో విశ్వనాథము యింటిముందు బండి ఆగినది. బండినుండి శేషగిరిరావుగారు, భార్య దిగినారు. ఎవరో వచ్చారని సుశీల తలుపుతీసింది. సుశీలను కౌగలించుకొని తల్లి బావురమంది. తండ్రి యానవాలుపట్టనేలేదు. 'ఏమే! తల్లీ! ఈలాచిక్కిపోయినావు; మాకుకాస్త ఉత్తరంముకైనా వ్రాయకూడదా తల్లీ! మేము నిన్ను ఇక్కడ ఉండనిత్తుమా' అంటూ తల్లి గోలపెట్టినది. ఇంతట్లో అన్నపూర్ణమ్మ వంటింట్లోంచి, 'ఎవరే, శుభమల్లేరాగాలు,' అంటూ సణిగింది. శేషగిరిరావుగారికి ఒడలు మండుకొచ్చినది. పోయి వియ్యపురాలిని రెండువేద్దామా అనుకొన్నాడు; కాని సుశీల తన యత్తగారినేమియు అనవలదని వట్టువేయుటచే మానివేసినారు.

సుశీలను పుట్టినింటికి పంపుట కన్నపూర్ణమ్మకెంతమాత్రము ఇష్టములేదు. తాను మర్యాదగా పంపకపోయినచో, శేషగిరిరావుగారే బలవంతముగా తీసికొనివెడతారని తెలుసామెకు! ఈపాటికి సుశీల తనసంగతిని తలిదండ్రులతో చెప్పియుండునని గ్రహించింది; అందుచే, 'పదిరోజులలో మఱలబంపండి. నాకు వేఱే ఆడపిల్లలు లేరుగదా; కన్నకడుపులాగ చూచుకుంటున్నాను సుమండీ; అది లేనిచో నాకు తోచదు;' అంటూ మెల్లిగా తనసమ్మతిని వియ్యంకునికి తెలియజేసినది.

ఈమాటలు వినేసరికి శేషగిరిరావుగారికి నవ్వు, కోపము ఒక్కసారి వచ్చినవి. కాని సమయముగాదని యూరకొన్నారు. మఱునాడుదయమే ప్రయాణము; అందుచే సుశీలను పెట్టెసద్దుకోమనిచెప్పి వారుకూడ ప్రయాణమైనారు.

'వెళ్ళివస్తా నత్తగారు!' అంటూ సుశీల అత్తగారివద్ద శెలవుతీసికొనుటకు వెళ్ళినది. 'అమ్మా! సుశీల! మఱల త్వరలోరమ్ము. మీా వాళ్ళిస్తామన్న సారె ఈసారి తీసికొనిరావాలి సుమా! వారికోడలు చూచావుగా, నిన్న మన యింటికి వచ్చినది సారె ఇచ్చుటకు' అంటూ ప్రేమగా కోడలిని పంపించింది, భార్య క్షేమము సుఖపడునుగదా యని విశ్వనాథము సంతసించి వారినిస్టేషనువఱకు సాగనంపి వెనుకకువచ్చినాడు.

సుశీలకు రైలులోనే తెలిసినది, తనభర్త మామగారికిఉత్తరమువ్రాసిపంపినాడని. భర్తకు తనయందుగలప్రేమకు చాలసంతసించినది.

ఆంధ్రభూమి

| | |
|---|---|
| సాలుచందా | రూ. 1—8—0 |
| విడిపత్రిక | రూ. 0—2—0 |

# వైద్యయోగరత్నావళి

(రెండవ కూర్పు : మిక్కిలి పెంపొందింపబడినది.)

266 ఔషధప్రక్రియలను వివరించు అమూల్యగ్రంథము.

**సుమారు 500 పుటలు.** **వెల రు 3—౦—౦.**

సంపాదకులు : పండిత ములుగు రామలింగయ్యగారు,

మదరాసు గవర్నమెంటువారు G. O. No. 2411 of 1929 లో ప్రకటించిన ఆయుర్వేద ఔషధయోగములన్నియు ఇందు వివరముగ వ్రాయబడినవి. యోగములన్నియు

1. అర్కములు
2. ఆసవములు; అరిష్టములు
3. చూర్ణములు
4. ఘృతములు
5. గుటికలు
6. క్షారములు
7. క్వాథచూర్ణములు
8. లేహ్యములు
9. లేపములు
10. నేత్రరోగౌషధములు
11. పానకములు
12. సత్వములు
13. సర్జికల్సు
14. తైలములు
15. భస్మములు: సిందూరములు
16. రసౌషధములు
17. ద్రావకములు

అను ప్రకరణములుగ విభజింపబడియున్నవి. మరియు గుణవంతములైన సంప్రదాయయోగములు, అవసరమైన పరిభాష చేర్పబడినవి. దశమూల, చాతుర్జాతక, త్రికటు మొదలగు గణములలోని వస్తువుల వివరము, గుణము వివరింపబడినవి. తూనికలు, కర్షములు, ప్రస్థములు మొదలగువానిని ప్రస్తుతమానమగు తులములలో చెప్పబడినవి. ఓషధియొక్క యేభాగము గ్రహించదగినది, విషప్రతివిషములు, శుద్ధులు, అలబ్ధప్రతినిధులు, యంత్రములు, పురములు, రోగలక్షణములు, వానికి తగుమందులు వివరింపబడినవి. ఆయుర్వేద మెడికల్ ఆఫీసర్లకును, ఔషధములను తయారుచేయు ఫార్మశీలవారికిని, ఇతర వైద్యులకును మిక్కిలి ఉపయోగకరమైనది.

మొదటికూర్పు ప్రతులు అచ్చుతీరిన ఆరుమాసములలోనే అమ్ముడుపోయినవనుచో ఈగ్రంథము ఎంతటి ప్రజామోదమునుబడసినదో తెలిసికొనవచ్చును. మీప్రతికొఱకు వెంటనే వ్రాయుడు.

ఆంధ్రభూమి బుక్ డిపో—వేపేరి, మదరాసు

# దీపావళి

రచయిత:



బసవరాజు అప్పారావు

లోకాని కుత్తుత్త దీపావళీ
నాకుమాత్రము దివ్య దీపావళీ!
వేదాల నాథుడో
వేదాద్రి నరసింహ
దేవుడే నాయింట
దీపమైనాడు!
లోకాని కుత్తుత్త దీపావళీ
నాకు మాత్రము దివ్య దీపావళీ!
వేద వృక్షములాగు
వేదాద్రి నీడ నా
వంశ వృక్షమ్ము శా
శ్వతముగా నిలవాలి!
లోకాని కుత్తుత్త దీపావళీ
నాకు మాత్రము దివ్య దీపావళీ!


బిడ్డలఆరోగ్యబలమునకు

స్వామీస్ 'బాలజీవన్' (రిజష్టర్డు)

అమృతమువంటిది.

బిడ్డలయొక్క అన్నివ్యాధులను తొలగించి నూతనజీవనము యిచ్చునట్టి అమృతతుల్యమగు ద్రావకము. బిడ్డల అజీర్ణము, కడుపునొప్పి, జ్వరము, విరేచనములు, వాంతులు, జలుబు, కఫము, మొదలగు సర్వవ్యాధులను తొలగించి ఆరోగ్యమొసగును.

వెల ఔన్సు సీసా రు. 0-6-0.
4 ఔన్సుల సీసా రు. 1-4-0.

కాల్పులు, నరకులు, నొప్పులకు

'సీతమలామా' (రిజష్టర్డు)

సంజీవివంటిది.

అన్ని చర్మవ్యాధులకు పైన వ్రాయుటకుపయోగించు ఓషధీమలామా. కాల్పులమందుగా ప్రఖ్యాతిగాంచినది. మూలవ్యాధిని, ముఖముపై మొటిమలను తొలగించును.

వెల ½ ఔన్సు సీసా రు. 0-6-0.
2 ఔన్సుల సీసా రు. 1-4-0.

మావద్ద ఇంకను పెక్కు ప్రశస్తమైన ఔషధములు గలవు. మా ప్రత్యేక ఔషధ కేటలాగునకు వ్రాయుడు. ఏజంట్లుగా నుండగోరువారు మాకు వ్రాసిన వివరములు తెలుపగలము.

**అశ్వినీకుమార ఫార్మసీ**

నర్సాపురం, పశ్చిమగోదావరి జిల్లా.

# జిజ్ఞాస — మీమాంస

విజ్ఞానసంపాదనావసరమున వివిధవిషయములందు కలుగు సందేహములను నివారించుకొన పత్రికాముఖమున జిజ్ఞాస సలుపుటకును—ఇందలి ఏ ఒక్క జిజ్ఞాసకైనను సరే సరియైన సమాధానము తెలిసియున్నచో దానిని కూడినంత సంగ్రహముగ వ్రాసి, ప్రచురణార్థము పంపుటకును ఆంధ్రభూమి పాఠకులను ప్రార్థింతుము. —సంపాదకుడు.

## ౯౮. పాగల్ హరనాథుడు

పాగల్ హరనాథబాబా పేరుతో ఆంధ్రదేశమందు వెలయుచున్న ప్రవక్త, యొకప్పుడు తాను పనిచేయు కార్యాలయమందు ధనమును తిబలబు చేసెనని యొకబంగాళీమిత్రుడు నాకు చెప్పుచున్నాడు. అది నిజమా? నిజమైనయెడల ఎప్పుడు చేసెను?

## ౯౯. నాగార్జునాచార్యులు

నాగార్జునాచార్యులను వాతడెవడు? అతడు యాంధ్రుడా? ప్రాచీనమందు అతడు యాంధ్రులకు చేసిన సేవయేమి?

—అడిదము వెంకటరామారావు.

## ౯౬. స్త్రీలకు శుక్రధాతువుకూడ వుండునా?

'ఆంధ్రభూమి' ఆగష్టుసంచికలో ప్రచురింపబడ్డ 'పిల్లలుపుట్టడానికి మగవానివీర్యం అవసరమా?' అనేవ్యాసంలో స్త్రీలకుకూడా శుక్రధాతువువుంటుందని వ్రాయబడింది. శాస్త్రరీత్యా ఇది సిద్ధమైన విషయమేనా?

—సమయమంత్రి సుబ్బారావు.

## ౯౭. సీమంతోత్సవం ఎందుకు?

గర్భవతులకు సీమంతోత్సవం ఏర్పరచడంలో మనపెద్దల ముఖ్యోద్దేశం ఏమైఉంటుంది?

—వడ్లమన్నాటి రామారావు.

## ౯౫. ఆంధ్రదేశంలో జనభాయొక్కసమ్మర్దం

ఆంధ్రదేశంలో చతురపుమైలుకి మిక్కిలి ఎక్కువమంది నివసించేతాలూకా, ఒక్కొక్కయింటిలో మిక్కిలి ఎక్కువమంది నివసించేపట్టణం ఏవి?

—వి. రామారావు.

## ౯౨. బ్రహ్మశ్రీ బ్రాహ్మణులకే చెల్లును

బ్రహ్మయనగా వేదము. 'బ్రహ్మశ్రీ' యనగా 'వేదముతో నొప్పుచున్నవాడ'ని యర్థము. శూద్రులకు వేదపఠనాధికారములేదని మన్వాదిస్మృతులు చెప్పుచున్నవి. శ్రుతులలోగూడ నీ నిషేధముగలదు. బ్రహ్మ క్షత్రియ వైశ్యసులజులకు వేదపఠనాధికారముగలదు. కాని క్షత్రియవైశ్యులకు వేదము నితరులకు బోధించుట కధికారములేదు. వేదమునందు పూర్ణప్రవృత్తిగలవాడొకబ్రాహ్మణుడు మాత్రమే. ఈ యంశమునుగూడ ధర్మగ్రంథము లన్నియు చెప్పుచునేయున్నవి. కాన బ్రహ్మశ్రీయను బిరుదము బ్రాహ్మణులకుమాత్రమే చెల్లును. శర్మ, వర్మ, గుప్త, దాసశబ్దములను క్రమముగ బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులకు వాడవలెనని గృహ్యసూత్రములు చెప్పుచున్నవి; స్మృతులుగూడ చెప్పుచున్నవి. ఇవి యితరులుగూడ వాడవచ్చునని యెచటను చెప్పబడలేదు.

—జటావల్లభుల పురుషోత్తము, ఎం.ఏ.

## ౯౩. సి. కే. నాయని పూర్తిపేరు

సుప్రసిద్ధ క్రికెటుయోధుడగు మేజరు సి. కె. నాయుడుగారు కొఠారి సూరయ్య, ఎం. ఏ. క్యాంటరుబరీగారి కొమారులు. వీరిపూర్తిపేరు కొఠారి కనకయ్యనాయుడుగారు, వీరు ఆంధ్రులు. వీరితండ్రితాతలకాలములో నాగపూర్ వలసపోయియుందురు. వీరు కొన్నిసంవత్సరములక్రితము శికింద్రాబాదు మహబూబుకాలేజియందు ఆంగ్లవిద్య నభ్యసించియుండిరి. వీరిబంధువులు శికింద్రాబాధులో యున్నారు.

—యస్. యస్. యన్. గుప్త.




# అనుభవ వైద్యుని అమృతసూక్తులు

పడుకునేటప్పుడు మాదీఫలపు ఆకుచూర్ణమును తేనెతో కలిపి నాకితే సుఖంగా నిద్రపడుతుంది. నిద్రానాశనమున ప్రశస్తమైనమందు.

... ... ...

పులగంలో పాయసం వేసుకుంటే విరుద్ధాహారం అవుతుంది.

... ... ...

అరటిపండును మజ్జిగ, పెరుగు వీనితో కలిపి తినకూడదు.

... ... ...

కంచుగిన్నెలో పదిరాత్రులకు పైబడి వుంచిన నేతిని తినడం విషాన్ని తినడమే.

... ... ...

తేనె, నెయ్యి వీనిని సమభాగాలుగా కలిపి సేవించకూడదు.

... ... ...

మనదేశపు పుల్ల రేగిపళ్లు ఎండపెట్టుకు తింటే ఏమాత్రం శ్లేష్మవృద్ధిచెయ్యవు; బాగా అగ్నిదీప్తిని కలిగిస్తాయి.

... ... ...

నూతుల్లోవుండే చేపల్ని తినడం కుష్టురోగం కలిగే కారణాల్లో ఒకటి.

... ... ...

ఎక్కిళ్లు ఎక్కువగావస్తూంటే కొంచెం తేనె నాకి, అగరువత్తులు వాసనచూడాలి.

... ... ...

మెంతికూర అరోచకాన్ని పోగొడుతుంది.

... ... ...

మల్లెపూవులు కళ్ళకు చాలామంచివి.

లవణరసాన్ని అతిగా సేవిస్తే వెంట్రు[illegible] బడతాయి.

... ... ...

మూర్ఛరోగులు కారాన్ని విస్తారం వాడకూడదు.

... ... ...

శ్రమను పోగొట్టడంలో రామాఫలం సాటిలేనిది.

... ... ...

గర్భవతులకు కుంకుడుచెట్టుగాలి చాలా చెరుపు చేస్తుంది.

... ... ...

తమలపాకుల్తో కాకుండా విడిగా పోకచెక్కలు తింటే శోఫరోగం, పాండురోగం కలుగుతాయి.

... ... ...

లావుపారినశరీరంకలవారికి కంద మిక్కిలిపథ్యంగా వుంటుంది. తఱుచు దాన్ని తింటూవుంటే శరీరస్థౌల్యం పోతుంది.

... ... ...

నిమ్మగడ్డి వేసిన మజ్జిగ వాడుతూవుంటే మగతనం నశిస్తుంది.

... ... ...

బాలరోగాల్ని పోగొట్టడంలో గాడిదపాలు ప్రశస్తమైనవి.

... ... ...

ప్రొద్దుటిపూట ఆవుపాలు, మధ్యాహ్నం దాటిం తర్వాత గేదెపాలు పుచ్చుకోడం మంచిది.

... ... ...

కొత్తతేనె శ్లేష్మాన్ని హరిస్తుంది; పాతతేనె మలాన్నిగట్టిపరుస్తుంది.

... ... ...

కుష్టురోగులు ఎప్పుడూ అల్లాన్ని వాడకూడదు.




## ౧౭౬. గృహలక్ష్మి దసరాసంచిక

ఈ సంచికయొక్క ముఖచిత్రము చాలా రమ్యంగావుంది. పత్రికలోని మాయ, స్మృతి వీధుల్లో, కైసేత మున్నగు ఇతరచిత్రములు మనోరంజకంగా వున్నాయి. వ్యాసములన్నియు స్త్రీ సంఘాభ్యుదయాన్ని సూచించేవిగాను, అనాదిగా సంఘములో నున్న దురాచారములను ఖండించేవిగాను వున్నాయి. స్త్రీలయొక్క అభివృద్ధికి తోడ్పడవలసిన పురుషులే స్త్రీలను పురాణకాలంనుంచీ అతివుదాసీనభావంతోను నీచంగాను చూస్తూ 'కులటలుగాభావిస్తూ' ఇతరములగు అస్వభావికవర్ణనలు చేస్తూ, స్త్రీల అధఃపతనమునకు కారకులయారనీ, జ్ఞానాభివృద్ధిఅయిన ఈ ఆధునికకాలాల్లోగూడా స్త్రీలను అతినీచంగా చూస్తున్నారనీ, ఆవిధంగాచూడటం గర్హ్యమనీ, స్త్రీలు బిడ్డలుకనే యంత్రములుకారనీ, సంపాదించువారు తామేనని మగవారు ఇంటివ్యవహారములందు ఏవిధంగా స్వతంత్రతగా సౌఖ్యంకలుగచేసుకొనుచున్నారో అదేవిధముగా స్త్రీలకుగూడా సౌఖ్యం కలుగచేసుకునే స్వాతంత్ర్యముండవలెననీ, స్త్రీని అర్ధాంగిగానే వ్యవహరించాలిగాని భర్తచేతియందు కీలుబొమ్మవలెవుంచుకొనుట శోచనీయమనిఈసంచికలోనిప్రముఖవ్యాసములలో నిరూపింపబడినది. 'సదుపదేశములు' అనువ్యాసములో దినమూ మనంచేసే పొరబాట్లకు మంచివుపదేశంఇస్తూ, అటువంటి సమయాల్లో ఎట్లా వ్యవహరించాలో బాగా నిరూపింపబడింది. ఆడపిల్లలుగలవారు ఆడపిల్లలను అత్తవారింటికిపంపేలోగా వారికి శుచిత్వము, వినయవిధేయత, సత్ప్రవర్తన, సద్గుణశీలము, శాంతి, శమదమాది భక్తియుతురాలుగా తయారుచేయుటకు తగిన జాతీయవిద్యావిధానము ఆవుసరమని సలహానిచ్చిరి. ఇది ఎంతయు చేకొనతగింది. ఏలననగా పిల్లలయందలి గారాబముచే వారిని ఏపని చేయనివ్వకపోవుటవలన, వారిచదువునందు శ్రద్ధవహించకపోవుటవలన, పిల్లలు ఏదైన తప్పుపనిచేసినప్పుడు వారిని మందలించక వూరుకొనుటవలన వారు ఆదర్శక స్త్రీలు కాలేకపోవుచున్నారు. మరిన్నీ చిన్నతనమునుండి వారిని అకారణముగా 'విసుక్కుంటూ', భయపెట్టుటవలన వారు పిరికివారుగా తయారయి సంఘమునకు వుపయోగకారులు కాకపోవుటయేగాక ప్రమాదవ్యక్తులుగ పరిణమించుచున్నారు. లోకహితకాంక్షతో వ్రాయబడ్డ ఇట్టివ్యాసాలను ఏర్చికూర్చిన గృహలక్ష్మిసంపాదకులు స్తవనీయులై యున్నారు. విడిసంచికవెల 0-4-0. దొరుకుచోటు : గృహలక్ష్మి కార్యాలయము, ఎగ్మూరు, మదరాసు.

—వి. రామారావు.

## ౧౭౭. నాచింకి-జోడు

ఇదియొక చిన్నహాస్యగ్రంథము. నవ్వులతీవ గ్రంథమాలలో 6-వ పువ్వు 'పెళ్లాన్ని యెలా పిలవడం,' 'అనుమానాలు,' 'దీనిపేరేమిటి,' 'ధ్రువ' మున్నగు గ్రంథములను రచియించిన శ్రీయుత కాంచనపల్లి వెంకటరంగారావుగారిచే రచియింపబడినది. చింకిజోడుచే మాట్లాడించి యజమానికి దానికి వాగ్వాదముపెంచి గ్రంథకర్త ఇందు హాస్యమును పోషించెను. వినోదపఠనమునకైన పుస్తకమగుట ఇది బహుజనామోదమును పొందగలదు. మాటుగా నీతిబోధకూడగలదు. వెల ఒకకానీ. కలయువారు గ్రంథకర్తచేర బరంపురము వ్రాయునది.

Printed at The Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.